# సిరిమువ్వలు

(వచన కవితా సంపుటి)

రచయిత

**చింతలపాటి మురళీకృష్ణ**

సిరిమువ్వలు

SIRI MUVVALU

(వచన కవితా సంపుటి)

FREE VERSE COMPILATION

First Edition : April, 2001

Price Rs. 30/-



ప్రతులకు

Ph : (08671) 55248

చింతలపాటి మురళీకృష్ణ

శ్రీకాకుళం - 521 132

(వయా) కొడాలి,

ఘంటసాల మండలం,

కృష్ణాజిల్లా



ఆరెస్కే మూర్తిగారు

(జననం : 03-09-1936 కైవల్యం : 03-10-1998)

# సమర్పణ

''ఆతడజాత శత్రుడు; మహాత్ముడు; స్నేహితులన్నవారిటుల్
ప్రీతి మెలంగబోలు ననురీతి నొసంగిన స్నిగ్ధమూర్తి; వి
ఖ్యాతు డపార జ్ఞాని; భరతావని ''జాగృతి'' కోరి పత్రికా
వ్రాతలచే ప్రసిద్ధిగొను బందరు పుణ్యచరిత్రుడైన మూ
ర్త్యాతడు 'రాజనాల శివరామ కృపామృత కృష్ణమూర్తికిన్
జోతలొనర్చి, వారి ప్రియ శిష్యునిగా "సిరిమువ్వల" న్నయీ
శాతశర ప్రసారమును సర్వజనాళి శుభంకరమ్ముగా
ప్రీతినొసంగుచుంటి నను పెంచిన మామ కుపాయనంబుగా!!''

- చింతలపాటి మురళీకృష్ణ

# ముందుమాట

పదహారేళ్లుగా నా గుండె చప్పుళ్ళ నుంచి వెలువడిన భీషణ సవ్వడుల కాణాచి యీ సిరిమువ్వలు. నా తొలి కుసుమం **నీరిచన్నం** కన్నా ముందే ఊపిరిపోసుకుని పదహారేళ్లూ నా ఆంతర్యంలోనే నలిగి చివరకు నూతన సహస్రాబ్దిలో వెలుగుచూస్తోంది ఈ నా పెద్ద బిడ్డ. అధర్మకర్మోన్మత్త ప్రపంచ సంచయాన్నెదిరించటానికి సర్వ హంగులూ సమకూర్చుకొని పరాశక్తిలా వెలువడుతోంది యీ చిన్మూర్తి.

కవి సామాజిక బాధ్యతను విడచి ఆత్మఘోషలోనో స్వార్థ చింతనలోనో మునిగిపోయినపుడు ఆ సమాజం దిగంబరంగా వికటాట్టహాసం చేస్తుంది. సంయమనంతో, విశాల దృష్టితో, సామాజిక ప్రయోజనం కోసం కవి కన్నెర్ర చేస్తే, అక్షర సాయకాలను సంధిస్తే నీతి మళ్లీ ఊపిరి తీస్తుంది.

కవికి అసాధ్యం లేదు; ఉండదు; సమాజం బతికినా, చెడినా, కవి వల్లనే జరుగుతుంది, అలా మంత్రించలేనివాడు కవికాడు. కవి సమ్మేళన సంభావన కోసం కాకల తోటే సరిపుచ్చుకునే వాడు - కా కవి, కుకవి.

ఇవ్వాల్టి భ్రష్ట సమాజానికి నీతిగల కవికావాలి. నీతిమార్గం చూపే కావ్యం కావాలి. ఆదిశగా సవరించిన నటరాజకంకణ నిక్వాణాలే యీ సిరిమువ్వలు. ఈ సవ్వడిలో వేదనాదం విజృంభిస్తే నా బిడ్డ చరితార్థ.

- రచయిత

# శ్రీ వేఙ్కటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి,

ప్రొఫెసర్ తేది: 18.12.99.

కొలకలూరి ఇనాక్ పి.హెచ్.డి.,

వైస్ - ఛాన్సెలర్

## ఆముఖం

శ్రీ చింతలపాటి మురలీకృష్ణగారూ -

మీ లేఖ, చీకటిలో సిరివెన్నెల, సిరిమువ్వలు అందాయి. 'సిరి' మీకు చాలా ఇష్టం లాగుంది. సిరివెన్నెల, సిరిమువ్వలు,....... పద్యకవిత నుంచి వచన కవితకు మీ ప్రయాణం గుర్తింపు పొందు తుంది. మీ 'సిరిమువ్వలు' కళ్యాణపు తలంబ్రాలు కావటం ముదావహం. మీ మినీ కవితలు ఘనీభవించిన రసార్ణవాలుగా ఉన్నాయి. పవిత్ర భారతిని మీ దృష్టి ''వైశాల్యం'' సంతరించు కొంటూ ఉంది -

భారత మాతకు జైకొట్టే మీ దేశభక్తి విశిష్టంగా ఉంది. అస్పష్టత నామమాత్రంగా కూడా లేని మీ వచన కవిత్వం అందరికీ అభిమాన పాత్రమవుతుంది.

మంచి కవిత్వం వ్రాసిన మీకు అభినందనలు. భవిష్యత్తు ఆకాంక్షించే మీకు శుభాకాంక్షలు.

మీ

కొలకలూరి ఇనాక్

డా॥ జి.వి సుబ్రహ్మణ్యం
ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు (రిటైర్డ్)
పూర్వపు డీన్, స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్
యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్
హైదరాబాద్ - 500 134

ఫోన్ : 7633275
'శ్రీవాణి' 1-8-702-105
నల్లకుంట,
హైదరాబాద్-500 044
తేదీ : 24.12.99

# పులివేట

ఇవి సిరిమువ్వలు కావు - అగ్గిరవ్వలు;

వినత రెండో అండంలో రెక్కలు తొడుక్కుంటున్న వైనతేయుడి వింత సవ్వడులు. మొదటివాడు ఎలాగూ అనూరుడై పోయాడు. తల్లి సాంస్కృతిక భావదాస్యాన్ని తొలగించటానికి మరో గరుత్మంతుడు పుట్టే పురిటినొప్పుల చప్పుడులు వినపడుతున్నాయి. వాటిని కాలం టేపుమీద అక్షర బద్ధంగా రికార్డ్ చేస్తున్నారు **శ్రీ చింతలపాటి మురళీకృష్ణగారు.**

వీరి కవితల్లో వినపడుతోంది పాత వస్తువుల అరిగినపాట కాదు. కొత్త ఒరవడికోసం సాగుతున్న వేట, ఈ వేటలో చిన్న చిన్న జంతువులు తక్కువ. చింతలపాటి వారికి చిరుతపులి వేటంటే ఒక సరదా. కొడితే పులినే కొట్టాలి మరి. నేటి సమాజ కీకారణ్యంలో లేడి నెత్తురు తాగిన పులులే ఉన్నాయి. శ్రీశ్రీ మహాప్రస్థానంలోని ''పులి చంపిన లేడి నెత్తురు'' వేరు. చింతలపాటి కవిత్వంలో నేను చెపుతున్న 'పులి' వేరు. లేళ్ళు, వాటి నెత్తురు వేరు. విజ్ఞులు ఊహించ గలరు.(కుహనా లౌకిక వాదులు పులులు. జాతీయతా వాదులు లేళ్ళు. దేశభక్తి లేళ్ళ రక్తం.) లేళ్ళు అంతరించే యుగాంతం వచ్చింది.

పులుల రాజ్యం పురివిప్పింది. లేళ్లరక్తంతో తడిసిన నేలలో నుంచి పుట్టాడు ఈ కవి. ఆధునిక ధర్మవ్యాధుడు. పులి వేటకు పూనుకున్న సాధువీరుడు. కాలం ఇతని కవితాశరాన్ని ఆహ్వానిస్తోంది. గురి తప్ప కుండా కొడుతున్నాడు - గొప్పగా రక్తం తాగే పులుల డొక్కల్లో డోళ్లు మ్రోగిస్తున్నాడు. నేల తల్లి గుండెలో నినదించే నిసర్గ సంతోష నిక్వణాలే ఈ **సిరిమువ్వలు.**

ఎవరైనా కవి తన కవిత్వం గురించి కవితరాస్తే ఆయన కవిత్వానికే కొలమానంగా పరిగణిస్తాం మనం. నన్నయ అయినా శ్రీశ్రీ అయినా ఎవరికైనా అదే మనం పాటించే ప్రమాణం. మరి చింతలపాటి వారి తీరేవేరు. కొట్టదలచుకొన్నవారి గుట్టును రట్టు చేసే కొలమానం వారి కవితా ప్రమాణం. కవిత అంటే ''కాగితాన్ని రేప్ చేసే కైపెక్కిన కలం పోటు''ట! ఇది సెక్స్ చారలతో తీండ్రించి దేశం మీదపడి అమాయక యువ కురంగాల నెత్తురు పీలుస్తున్న కవిపులుల కళాదృక్పథాల మీద సంధించిన వాఙ్మయాస్త్రం. సాహితీ కళామూల్యాల విధ్వంసక శక్తుల మీద ఒళ్లు మండి తిరగబడుతూ గొరిల్లా పోరుతో రహస్య స్థావరాల నుంచి బాణప్రయోగం చేస్తున్న రహస్యవీరుడు ఈ కవి. ''వీరకిరీటి''ని సైతం బెంబేలు పెట్టించ గలిగిన విశిష్ట వీరుడు

''ఈ దేశంలో
రాముడు, కృష్ణుడు కూడా
పక్కా మతతత్త్వవాదులే !
పరలోక మార్గాన్ని చూపే
పరమప్రభు దాసులే -
ఏ మైలలేని లౌకికవాదులు !!

- అవసరాలను బట్టి
శబ్దార్థాలను మార్చుకోగలిగితే
కిరీటం ఎప్పుడూ
ఒక గుండు మీదనే ఉంటుంది !!''

ఇందులో ''వీరకిరీటి'' లౌకికవాదం పేరుతో ప్రభుత్వాన్ని చెలాయించే అవకాశవాదికి ప్రతినిధిగా ప్రత్యక్షమౌతాడు. ఆ కిరీటి కిరీటాన్ని కూడా కదిలించి క్రిందికి తోస్తోంది చింతలపాటి వారి చురుకైన నాగాస్త్రం.

మన దేశంలోని సమకాలీన సాంస్కృతిక సంక్షోభాన్ని చూచి కార్చిచ్చుగా రేగి కలం పట్టుకొన్న 'జ్వాలాముఖి' ఈకవి. పులివేటలో ఈయనది ఒక ప్రత్యేకమైన బాణీ, సమాజం అరణ్యాం. భావజాలం కార్చిచ్చు. అధిక్షేపం కారుపొగ. అభివ్యక్తి పదునైన బాణం. ఈ కవి పులుల చుట్టూ మంటపెట్టగలడు. పొగలు క్రమ్మించి వాటిని ఉక్కిరి బిక్కిరి చేయగలడు. అక్షయతూణీరం లోంచి అక్షరబాణాలను ప్రయోగించి రక్తం కక్కించగలడు. పులి మీద జాలిలేదు. పులిని చూడగానే కవి వీరుడికి అది తాగిన లేళ్లనెత్తురు జ్ఞాపకం వస్తుంది. తాను పుట్టిన మట్టి నుంచి వస్తున్న రక్తపువాసన మనసును సంక్షోభ పరుస్తుంది. బాధలో నుంచి వచ్చిన వాఙ్మయాస్త్రం వాడిగా ఉంటుంది. తప్పదు మరి. ఇది వేట! పూలతోటలో ఆటకాదు మరి!

ఈ కవి ప్రయోగించే వాఙ్మయాస్త్రాలు కర్మాగారంలో తయారైనవి కావు. అయ్యుంటే అవన్నీ ఒకేరకంగా ఉండేవి. స్వీయ కుటీరపరిశ్రమలో తయారైన దేశీయాస్త్రాలు. ఒక్కొక్కదానికి ఒక్కొక్కపదును, ఒక్కొక్క మంత్రం, ఒక్కొక్క ప్రయోగం, ఒక్కొక్క నేర్పు, ఒక్కొక్క ఫలితం; పదునుకు ఈ 'స్వాతంత్ర్యం'

వ్యంగ్యాస్త్రం.

''భారతదేశ స్వాతంత్ర్యం
మహాత్మాగాంధీ బోసినవ్వులో ఉంది!
అర్ధ దిగంబరత్వంలో ఉంది -
చేతికర్రలో ఉంది;
చిన్ని పిలకలో ఉంది.,-
కాని
ఈ కాలంనాటి
ఏ పౌరుని మెదడులోను లేదు''

ఈ దేశంలో 50 ఏళ్ల స్వతంత్రపాలనం తరువాత ఏర్పడిన జాతీయభావ సంపద దివాళాకోరుతనాన్ని వ్యంగ్యంగా చెబుతూ గూబగుయ్యి మనిపించే అక్షరప్రయోగం. ఇదొక కళ!

ఈనాటి సినీ గీత కవిత్వానికి ఒక మహనీయ మంత్రం ఈ కవి స్నేహబోధ:

''శరీరాన్ని పలకరించకు
మనసుల్తో మాట్లాడు
అనుభూతుల్లో భోంచెయ్
హృదయాల్లో నిద్రపో!...అదే స్నేహం''

అనుభూతివాదంలోని అంతసూత్రాన్నీ, ఆధునిక కవితా జీవిత మంత్రాన్నీ సూటిగా ఘాటుగా కూడా చెప్పే కళ ఇది. ఈ కవి ఇందులో సవ్యసాచి. తట్టి చెప్పగలడు. తిట్టి చెప్పగలడు.

చింతలపాటి వారు చిత్రమైన ప్రయోక్త, ఖండకావ్యాన్ని అఖండం గా నడపగలరు. లఘుకవితలను రమ్యంగా తీర్చగలరు. మినీ కవితలతో మిరుమిట్లు కొలిపించగలరు. ఆవేశంతో జలపాతంలా

దూకగలరు. ఆగ్రహంతో కత్తిసాము చేయగలరు. కసివస్తే త్రిశూలాలు గుచ్చగలరు. ఎదురుపడితే ఈటెలు విసరగలరు. ఎగతాళిగా వెక్కిరించగలరు. సభ్యతతో సాధించగలరు. సాంస్కృతిక విప్లవ కారుడికి కావలసిన వాఙ్మయ కళా రహస్యాలన్నీ చింతలపాటి వారికి తెలుసు. మచ్చుకొక చిన్న కవిత- **''టోపీ''.**

''కొబ్బరి కాయను
కోసి, పీచుతీసి, పగలగొట్టి, నీళ్లిచ్చి,
కొబ్బరి తినిపించాను -
నన్ను
చేతకాని 'వెధవాయ్' అన్నారు!
గుంజుమింగేసి
వెలగపండును
అలా... అలా...స్టైల్‌గా
అలవోకగా అందించింది గజరాజు;
ఓహ్-
'కింగ్' అంటే నువ్వే అన్నారు''

సారవంతమైన సంప్రదాయ సాహిత్యాన్ని కాదని లోనలొటారం పైనపటారంగా సాహితీలోకంలో సామ్రాజ్యాలేలుతున్న కుహనా కవిగజాలమీద ఈ **''టోపీ''** పెద్ద అంకుశం. సాహిత్యం మీద అపండితులు, ప్రతిభాహీనులు పెడుతున్న పెద్దటోపీని చిన్న కవితలో ప్రతిఫలింపజేసిన ప్రజ్ఞావంతుడు ఈకవి. శీర్షికను కూడా శిల్పంగా మలచిన మనస్వి.

కవిత్వం వింటే ప్రత్యక్ష ప్రబోధం చేసినట్లు రాయటం ఒక నేర్పు. పరోక్షంగా వ్యతిరేక ప్రబోధం చేసేటట్లు రాయటం మరొక నేర్పు. మచ్చుకు రెండుకవితలు **'వైకుంఠపాళీ'** ని గమనించండి.

ఎయిడ్స్‌ను గురించి ధ్వనిమయంగా ప్రత్యక్ష ప్రబోధం చేసే నైపుణ్యానికి అదొక అనల్ప శిల్పం. అలాగే వ్యతిరేకప్రబోధ నైపుణ్యాన్ని ప్రదర్శించే కవిత **''ఎలక్షన్''**

''ప్రజాధనాన్ని
ఐదేళ్లూ
అనుభవించటానికి
పరిష్మనిచ్చే
మట్కా-జూదం!''

ఈ రెండు కవితలూ ఆయా అంశాలపై అమితశక్తివంతమైన కవితా శిల్పాలు!

ఏకావ్యం చదవటం మొదలుపెట్టినా పఠిత మొదలు - చివరలను ముందు సమీక్షిస్తాడు. ముందుగా ఇందులో **'సిరిమువ్వలు'** మోగుతాయి. అవి రచయిత ఆశలు. ఆశయాలు, చివర 'పవిత్ర భారతి' దర్శనమిస్తుంది. అది మనకు కవి అందించే ఫలితాంశం.

''ఐరోపా జాతీయులందరూ
ఏకాంశరూపులై మళ్లీ పాలకులుగా వచ్చినా
మన భారతం చెడదు!''

అన్నది ఈ కావ్య సందేశం, బహుళ జాతి సంస్థలు సాగించే సాంస్కృతిక సామ్రాజ్యవాదం దాడికి తట్టుకొని నిలబడే జాతీయ ఏకాత్మికవాదశక్తి భారతజాతికి ఉన్నదన్న ఆత్మవిశ్వాసంతో కవి గళమెత్తాడు. కలాన్ని ఝళిపిస్తున్నాడు. దానిని మాతృ దేశారాధనగా భక్తితో నివేదిస్తున్నాడు. నేటి భారతీయ సాహిత్య జాతీయతోద్యమ వీర శంఖారావం ఈ కావ్యం!

'' పాణినీయ సూత్రాలకు ప్రభువై నర్తించిన
ఆ సర్వేశ్వరుని కాలిమువ్వ'' - ఈ కవితలో ప్రతి సవ్వడి,

''అధర్మకర్మోన్మత్త ప్రపంచ సంచయానికి
నా ఉనికి విలయం; నా స్పర్శ ప్రళయం''- ఇది ఈ కవి గర్జ;

'' ఆధునిక మానవుడు - ఆటంబాంబు భయంతో
ఎప్పుడో చచ్చిపోయాడు''- అన్నది నైతిక వాస్తవికత !

''అవినీతి రాజుల పాలయితే
అథోగతి సామాన్యుల పాలవుతోంది''- ఇది సామాజిక వాస్తవికత;

''భారతీయ మార్కెట్లో
ప్రాణం ఖరీదు ఒక సెకను
భద్రత ఖరీదు ఒక బాంబు
శీలం ఖరీదు ఒక సినిమా''- మన సాంస్కృతిక పతన చిత్రం;

''ద్రవిడ యూనివర్శిటీ ప్రొఫెసర్
'తక్కతై' రీసెర్చితో - ఐరన్‌లెగ్ అవుతున్నాడు'' ఇదొక నాటుబాంబు.

''మినీకవి సరసానికి - ముక్కెర జారిన పద్యం'' -ముత్యం లాంటి ముచ్చట.

''కల్చరల్ హెరిటేజ్ మా తాతకిచ్చేయ్
నల్లమందు నాకు చాలు'' - సిగ్గున్నగొడ్డుకు ఒక చింతబరికె!

''సనాతన న్యాయ వ్యవస్థ
హూణుల కాళ్లకింద ఏనాడో నలిగి చచ్చిపోయింది;
ఇవ్వాళ దాని అలంకార భవనాలే

వెక్కిరిస్తూ అగుపిస్తున్నాయి'' - మట్టి మొరపెట్టుకుంటున్న జీవుని వేదన;

''ఓర్పుకు ఒక హద్దుంటుంది''-అని హెచ్చరిస్తున్న కవి పాలికేక!

**శ్రీ చింతలపాటి మురళీకృష్ణగారి** సిరిమువ్వలు ఆనందగీతాలు కావు. ఆగ్రహావేశాలు కావు. అంతస్తాపం దేశభక్తితో ప్రజ్వలిస్తూ, జాతీయత కోసం చేతులు పైకెత్తి పిడికిళ్లు బిగిస్తూ, విలయం నుండి దేశానికి విముక్తి సాధించాలని పాడే సమర సంగీతధ్వనులు. ఈ విజయప్రస్థానంలో మరెన్నో ముందడుగులు వేయాలని మిత్రులు మురళీకృష్ణగారిని కోరుతున్నాను. తిరుగులేని ఈ ధర్మయుద్ధం తెలుగులో ఒక వెలుగు బావుటా ఎగరవేయాలని ఆశిస్తున్నాను.

జి. సుబ్రహ్మణ్యం



ఫోన్:(040)7017207

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి,
ప్రధాన కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్ (రిజి)
హైదరాబాద్

3-4-7054, నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029

తేది:12.01.2000.

# ''మువ్వల ధ్వనులు''

1. ''కవులు కావ్యాలు వ్రాస్తారు. ఉత్తములు లాలిస్తారు. చెట్లు పూల నిస్తాయి. గాలి గంధం మోస్తుంది.'' ఈ భావం ఒక సంస్కృత శ్లోకానిది.

ఉత్తముడు సహృదయుడు కాబట్టి లాలిస్తాడు. ఈయన గుణాలు మెచ్చుకొంటాడు. దోషాలు పట్టించుకోడు.

సాధారణ పాఠకుడుంటాడు. అతనికి ప్రధానంగా వస్తువు మీదనే దృష్టి ఉంటుంది. తన అధ్యయనంలో ఏ కొద్దిపాటి లీనమైనా ఆయా అనుభూతులను పొందుతూ సాగిపోతాడు.

ఇక విశేష పాఠకు డొకడుంటాడు. ఈయన కావ్యాన్ని చీల్చి చీల్చి చదువుతాడు.

కావ్య వస్తువు, కావ్య ఛందస్సు, కావ్య భాష, కావ్య నాయికా నాయకులు, కావ్య ధ్వని, కావ్య రసం, కావ్య హేతువు, కావ్య సందేశం... తన అధ్యయనంలో ఇలా ఇన్నిటిపై దృష్టి సారిస్తూ పోతాడు - విశేష పాఠకుడు.

2. **శ్రీ చింతలపాటి మురలీకృష్ణ సిరిమువ్వల** అధ్యయనంలో మనమూ విశేష పాఠకుల మవుదాం. వారు సహజంగా పద్య కవితా

ప్రియులు. సంప్రదాయం పునాదిగా ఎదిగినవారు. రస, అలంకార, గుణ రీతి, ధ్వని, రసధ్వని, వక్రోక్తి, అనుమితి, ఔచిత్య సంప్రదాయా లను వరుసగా అందించిన భరత, భామహ, దండి, వామన, ఆనంద వర్ధన, అభినవ గుప్త, కుంతక, మహిమ్నభట్ట, క్షేమేంద్రాదులను చదివిన వారు. భారతీయ ఆలంకారిక దృక్పథానికి పరవశమైనవారు. ఇంగ్లీషు అధ్యయనం వల్ల కొన్ని పాశ్చాత్య విమర్శనా దృక్పథాలు తెలుసు కొన్నవారు.

ఛందస్సు రీత్యా పద్యం వైపే మొగ్గి ఉన్న వారు. మిత్రులెవరో వీరు వచనకవితలు వ్రాయగలరా- అని భావించారని- 1983 నుండి అప్పుడ ప్పుడు వ్రాసుకొన్నవి- **"సిరిమువ్వలు"**గా అందిస్తున్న వారు. ఇది పదహారేళ్ల పంట. ఒక విధంగా షోడశి. షోడశి సుసంప్రదాయ. ఈ షోడశికి ఉన్న అలంకారాలు నవ్యాతినవ్యం. అందువల్ల ఈ కవితా సంపుటి అనే షోడశి నవ్యసంప్రదాయ.

3. సంప్రదాయవాదం (క్లాసిసిజం) ప్రాచీనతను అనుసరిస్తుంది. సమష్టితత్త్వం, నియమబద్ధత, మేధోసంపన్నత, కొంత స్తబ్దత క్లాసిసిజం లక్షణాలుగా చెబుతారు. అనంతమైన భావాలూ, అనుభూతులూ పరిమిత రూపంలో వ్యక్తమవుతాయి. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాధాదులందరూ ఈ కోవలోకి వస్తారు.

ఆధునిక దృక్పథంతో సంప్రదాయాన్ని రంగరించింది నవ్య సంప్రదాయవాదం (నియో క్లాసిసిజం). వీరికి సంప్రదాయ వైదుష్య ముంటుంది. ఆ లక్షణాలపై అధికార ముంటుంది. దానిని అనుకరిస్తారు. కాని హేతుప్రత్యయబుద్ధితో, లోకజ్ఞతతో. ఆధునిక జీవనంలో సంప్రదాయాన్ని చొప్పిస్తారు. నగరంలో జరిగే వివాహంలో కుమ్మరి చేసిన కుండ కనిపించక (దొరకక)పోతే సంప్రదాయం వీడకుండా ఆ ఆచార సందర్భంలో స్టీలుబిందె వాడినట్లన్నమాట.

వస్తువులో, అలంకారాల్లో, భావచిత్రాల్లో శ్రీమురళీ కృష్ణ చేసిన పనే ఇది.

అయితే వీరు కేవలం నవ్య సంప్రదాయానికే కట్టుబడి ఉండరు. కాల్పనికవాదం(రొమేంటిసిజం)లోకి వస్తారు. కల్పితేతి వృత్తం, అనిర్దిష్టాకృతి, మనోవస్థావర్ణనం, ఊహాపోహాత్మకత, విచిత్రమూ - విషాదమూ ఇలా ఎన్నిటినో కాల్పనిక వాదం సమ్మానించింది. ఈ సంబారాలన్నిటినీ శ్రీ మురళీ కృష్ణ సంభావించిన వారే.

అంతేగాక వీరి కవితల్లో వాస్తవికవాదం (రియలిజం), ఆదర్శవాదం (ఐడియాలిజం), అధివాస్తవికత (సర్రియలిజం) ప్రతీకవాదం (సింబాలిజం), భావ ముద్రావాదం (ఇంప్రెషనిజం), భావచిత్రవాదం (ఇమేజిజం) ఇవన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎప్పుడో వెనుకబడి పోయింది అనుకున్న డాడావాదం (డాడాయిజం) వీరి కవితల్లో కనిపించటం విచిత్రం. వీటన్నిటితోపాటు తనదైన అభివ్యక్తి (ఎక్స్‌ప్రెషనిజం) ఉండనే ఉన్నది.

అన్నిటినీ మించి ఈ కవితలనిండా జాతీయ భావ ముద్రావాదం (నేషనలిస్టిక్ ఇంప్రెషనిజం) సర్వే సర్వత్ర పరచుకొని కనిపిస్తుంది. ఇది సరస్వతీ నదిలా అంతర్గత ప్రవాహిని కాదు. ఇది హిమాలయంపై నుండి దూకే గంగ. ఇది గలగలపారే బ్రహ్మపుత్ర. ఇది మైదాన స్రవంతిక. రూపంలో, భావంలో, అభివ్యక్తిలో దాపరికం లేని ప్రవాహ కవిత **''సిరి మువ్వలు''**.

4. పద్యాలకు లక్షల వృత్తాలున్నాయి. గేయాలకు వేలకొలది బాణీలున్నాయి. వచన కవితలకు స్వచ్ఛందత ఉన్నది. భావస్రవంతికి ఆటంకం లేని ప్రవాహిని వచన కవిత, కావ్యాలు, ఖండకావ్యాలు, శతకాలు, అవధానాలు, పద్యవిద్యకు ఆలవాలమైనాయి. భజన సంకీర్తనలు, ఉద్యమాలు, చలనచిత్రాలు, గేయవిద్యకు ఆధారంగా నిలచాయి.

ప్రధానంగా పత్రికలు, కవి సమ్మేళనాలు, వచనకవితను పరిపోషిస్తు న్నాయి.

అయితే అంతా వచన కవితామయమే అన్న ప్రచారమొక్కటి కొనసాగుతున్నది. పద్యంలో రాగం వల్ల ఏర్పడుతున్న అస్పష్టత వచన కవితల్లో లేదనే అభిప్రాయం ప్రకటిత మవుతున్నది.

దేని సుగుణాలు దానివి. కాని ఇవి ఒకదానికి ఒకటి పోటీ అను కోవటమే పొరబాటు. ఈ పొరబాటు పద్య సంప్రదాయాన్ని విచ్ఛిన్నం చేయాలనుకొన్న దుర్మార్గులు ప్రారంభించారు. ఆ ప్రారంభించిన వారు పెద్దవారై పోవటంతో వారిని అనుసరించే పిల్లలు కూడ పద్యం నడ్డి విరగ్గొడతామని కూస్తున్నారు. వారి కొమ్ము కాస్తున్నారు.

విమర్శలకు సహృదయత లోపించటం వల్ల పుట్టుకొని వచ్చిన వికారాలు ఇవన్నీ. అందువల్ల రూపంతో-ప్రక్రియతో పేచీ పడవలసిన అవసరంలేదు. రూప ప్రక్రియాది భావాలన్నీ కూడా కళాతత్త్వ నిరూ పణకూ (ఈస్తటిజమ్), సామాజిక ప్రయోజనానికి ఉపకరించేవే, సంప్రదాయం వాహకంగా పురాణాన్నీ, జంగం కథను, హరికథనూ ఎన్నుకొని జనంలోకి వెళ్లినప్పుడు, ఆ ప్రదర్శన ప్రక్రియలోని సొగసునూ, కళాంతరంగ సందేశాన్ని అందరూ సమ్మానించినవారే కదా! అందుకే కళకు సౌందర్యం ప్రయోజనాలు రెండూ కూడా ఒకే నాణేనికున్న బొమ్మా బొరుసులుగానే భావించాలి.

**శ్రీ చింతలపాటి మురళీకృష్ణ** ఎవరో అన్నారని, అంటారని అను కోవటం వల్ల ఈ వచనకవిత స్వీకరించానని భావించటం ఆయన అంత రంగమే తప్ప ఇంకేంకాదు. ఈ అంతరంగం కాల ధర్మానువర్తిని.

5. యౌవని మృదుమంజీరాలను రససోపానాలుగా, సరంగును చకోర ప్రతిమగా, పిల్లనగ్రోవిని మ్రోగించే పశువుల కాపరివైఖరిని నాదబ్రహ్మోపాసనా ఝురిగా, కూచిపూడి నర్తకి కంకణ నిక్వాణాలు

నినదించే వేదాలుగా భావించిన ఈ సిరిమువ్వలకు స్వాగతం పలుకకుండా ఉండగలమా?

''.....మోడు వారిన చెట్టునీడన
గ్రీష్మాతపానికి విలవిలలాడే
నా కూతురు
శిశిరాన్ని చింపేసే చిన్మూర్తి స్వరూపిణి!!''

అన్న కవి హృదయంలోని తాత్త్వికతనూ, సామాజిక ప్రయోజనాన్ని సంభావించకుండా ఉండగలమా?

''అమ్మ తాను సవరించి
మలచిన యీ సిరిమువ్వలు -
కళ్యాణపు చిహ్నాలు
లోకానికి తలంబ్రాలు! -

ఇదే కవి కోరిన శ్రేయస్సు; విశ్వశ్రేయస్సు,

ప్రేయస్సు వ్యక్తిగత మైనది; శ్రేయస్సు విశ్వజనీన మైనది. ఈ ఉద్దేశ్యంతో కలంపట్టి సిరిమువ్వల కవితల నొలికించిన కవికీ, కావ్యానికీ స్వాగతం!

6. అయితే యీ మువ్వల ధ్వనులెన్ని? అవి యేడు కాదు; ఏడు పదులు - సిరిమువ్వల నుండి పవిత్రభారతి వరకు;

''నాలో రగిలే స్వార్థపిశాచం
ఎదిగి ఎదిగి బ్రహ్మాండాన్ని మ్రింగనీ'' - అన్నారు కవి. ఇది ధ్వనే, నిజంగా స్వార్థం పెరగాలనే ఆకాంక్ష కాదు. ఇది శూన్యమై పోనీ అనే ధ్వనే స్ఫురిస్తుంది.

''-భీప్రదక్రకచోగ్ర దంష్ట్రా దావానలం....
రుచిరజ్వాలా రోచిర్నివహం....

అధర్మ కర్మోన్మత్త ప్రపంచసంచయం...'' వీటిని కాల్చే కార్చిచ్చు కవి కవిత. ఈ కవిత వీటికి విలయం- ప్రళయం. అందుకే కవి గర్జిస్తున్నారు, గాండ్రిస్తున్నారు. ఏదేశాన్నో వచ్చి గర్జించు, గాండ్రించు అని ఓ కవి పిలిస్తే అలా పిలవడమేమిటి? నా దేశంలోని చెడును నేనే దూరం చేసుకొంటా! నేనే గర్జిస్తా; గాండ్రిస్తా అంటున్నారు కవి. ఇదీ ఈ పదాల మాటున దాగిన ధ్వని, విప్పిచెప్పితే గాని కొందరికి తెలియదు. ''కప్పిచెప్పేది కవిత్వం - విప్పి చెప్పేది విమర్శ'' అన్నారు అందుకే.

పూర్వం ఒక సైతాన్ను ఓడించటానికి ఓ బలవంతుని సహాయం కోరిన కథ ఒకటి... పెద్దలు చెబుతూంటే వింటూంటాం. సైతాన్ను ఓడించిన బలవంతుడు తన సహాయానికి ప్రతిఫలంగా సామాన్యుణ్ని బానిసగా మార్చుకొన్నాడు.

స్వామి రామతీర్థ చెప్పిన కథ ఒకటి ఇక్కడ అన్వయించు కోవచ్చు. తన స్వేచ్ఛావిహారానికీ, తిండికి మాటిమాటికి అడ్డం వస్తున్నకొమ్ముల దుప్పి బారినుండి బయటపడాలనుకున్న గుఱ్ఱం, మనిషిని తనపై కూచోపెట్టుకుని చంపించింది.అలా తనకు స్వేచ్ఛ లభించిందన్న ఆనందం అశ్వానికి మిగలలేదు. మనిషి దాని వీపుమీద కూచొని స్వారీ చేసే రుచికి మరిగి, అశ్వానికి కళ్లేలు బిగించి, బానిసగా మార్చు కొన్నాడు.

ఇది తెలియని విదేశీ ఇజాల బానిసలు ఆ యిజాలను ఈ దేశంపైకి రమ్మనడం ప్రమాదం కదా! ''కార్చిచ్చు''-కవిత వెనుక ఇంత కథ ఉన్నది. ధ్వని మర్మమున్నది.

7. ఈ కథ తెగదు; ముడిపడదు; ఇది అనంతం, ఇది అవిచ్ఛిన్నం. ఇది అఖండ చైతన్యధార.

''పరులకుపకారం చేయటం పుణ్యం; పరపీడనం పాపం''-

అంటూ ఏనాడు వ్యాసుడు పద్దెనిమిది పురాణాల్లోని సారాంశం ఇదే అంటూ చెప్పారో ఆనాటి నుంచి ఇందుకొరకే భిన్న ప్రక్రియల్లో రచయితలు రచనలు చేస్తున్నారు. అయితే ఆనాడే ''చేతులెత్తి మొత్తు కుంటున్నా! ధర్మాన్ని అనుసరించేవారు కనిపించటం లేదు; నా మాట వినటం లేదు; అన్నారు వారు; వినకున్నా అనుసరించకున్నా కవులూరు కొంటారా? వందమందిలో పదిమంది విని ఒక్కడు ఆచరిస్తే చాలు ననుకొంటారు. రచనలు చేస్తూనే ఉంటారు; వినిపిస్తూనే ఉంటారు. అందుకొరకే ఈ రచయిత **సిరిమువ్వలు** కట్టుకొన్నారు; ఆర్తితో నర్తిస్తున్నారు; భారతీయ సాహితీ మూల్యాల ప్రస్థాపనానికి ప్రయత్ని స్తున్నారు.

ఆ ప్రయత్నంలో వచ్చిందే ఈ వచన కవితా సంపుటి. దీనిని ప్రక్రి యా దృష్టితో అధ్యయనం చేయవచ్చు. ఇందులోని మినీ కవితల్ని ప్రత్యేకంగా పరిశీలించవచ్చు, ''కేసియోడ్రమ్, వీరకిరీటి, లైట్(ఫ్) మ్యూజిక్, పోయెస్‌గార్డెన్, సిప్ సిప్ హుకే, నయామంజిల్, నైటీ తొడుక్కో....'' తదితర కవితల్లోని ధ్వనుల్నీ, చురకల్నీ, అధివాస్తవి కతనూ ప్రత్యేకంగా విశ్లేషించవచ్చు.

''అభినందనలు, హృదయాంజలి'' వంటి కవితల్లో వచన కవిత లైనా లయాత్మకత కనిపించటంలోని ఆవశ్యకతను గుర్తించవచ్చు. వాటితోపాటు ''దేశభక్తి, ధర్మం చెరచకు, మహాత్ములు కండి, మతతత్త్వవాదం, సనాతనం, పవిత్రభారతి'' వంటి కవితల్లోని భారతీయాత్మను, జాతీయవాద దృక్పథంలో అనుశీలించవచ్చు.

''...అవసరాలనుబట్టి
శబ్దార్థాలను మార్చుకోగలిగితే
కిరీటం ఎప్పుడూ
ఒక గుండు మీదనే ఉంటుంది''! (వీరకిరీటి)

"...త్యాగరాయగాన సభలో
చెంఘిజ్‌ఖాన్ అంగన్యాసం;
సంప్రదాయ వారధిలో
సైతాన్ సణుగుడు సంగీతం! (లైట్ (ఫ్) మ్యూజిక్)

కవితాత్మకత, సందేశాత్మకత నిండా ఉన్న ఇటువంటి వెన్నో ఈ సిరిమువ్వల్లోని అమరధ్వనులు. ఇవే ఈ కవితా సంపుటికి ప్రాణం. ఈ ప్రాణానిలాన్ని ఆధునిక కవితాప్రపంచంలోకి ఊదాలి. పద్యానికైనా, గేయానికైనా, వచనానికైనా ఇవే ఆధారభూతమని చెప్పాలి.

ఇదంతా ఈ పుస్తకం మీద మున్ముందు అధ్యయనానుశీలనాలు జరిగినప్పుడు చేయాల్సిన కృషి, మొన్న మహోధీగ, ఆగ్నేయాస్త్రమ్ కవితా సంపుటి ఈ పద్ధతిలోనే వచ్చింది. ఇవాళ "సిరిమువ్వలు" వచ్చింది. రేపు మరొకటి వస్తుంది. ఈ కవితా వ్యవసాయం ఇలాగే కొనసాగనీ.... ఈ కవి కుమారులు ఈ అవిచ్ఛిన్న సాంస్కృతిక ధారకు ఇదేవిధంగా నీరాజనాలు పలకనీ...

అందరి ఆశయమిదే; ఆశంసా ఇదే!!

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
కార్యదర్శి,
జాతీయ సాహిత్య పరిషత్.

భాగ్యనగర్,
12, జనవరి, 2000.



**డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు,**
ఎం. ఏ (ఇంగ్లీషు) ఎం.ఏ (తెలుగు), ఎం.ఏ (హిందీ), పి.హెచ్.డి.,

**రీడర్**
హిందూ కాలేజీ
**మచిలీపట్నం**

మచిలీపట్నం
30.4.2000

# ''మువ్వల సిరి''

''చీకటిలో సిరివెన్నెల''ను కురిపించిన శ్రీ చింతలపాటి మురళీ కృష్ణ ఈసారి **''సిరిమువ్వల''** సవ్వడిని వినిపించటానికి చేసిన ప్రయత్నమే వారి యీ రెండవ కావ్యం. ఈ మువ్వల రవళిలో పశుల కాపరి మ్రోయించే వేణువు నుండి వెలువడే నాదబ్రహ్మోపాసనా ఝరి, కూచిపూడి నర్తకి కంకణ నిక్వాణాలు, లంకా సుబ్రహ్మణ్య ఘనాపాఠి పనస పారాయణ నినదించటమేకాక లోకానికి తలంబ్రాలై, అక్షరాక్షతలై కవిజన్మను సార్థకం చేస్తాయి. కాల పురుషుని చోదకత్వంలో రధికునిగా పయనిస్తున్న కవికి ఎక్కువగా ''సగటు మనిషి సుప్త సంతప్తజ్వాలలే'' ఎదురవుతాయి **''బానిసోళ్లు''** అనే కవితలో అందుకే చావటానికి రోజూ బ్రతుకుతూ-చావుకి భయపడే సన్యాసి జీవులు-బానిస బ్రతుకులు - ఈ దేశంలో ఎన్నో - ఎన్నెన్నో'' అంటారు కసిగా. 'చౌకడిపో' అనే కవితలో

''భారతీయ మార్కెట్‌లో
ప్రాణం ఖరీదు ఒక సెకను
భద్రత ఖరీదు ఒక బాంబు
శీలం ఖరీదు ఒక సినిమా'' అంటూ రోజురోజుకీ పెరిగి

పోతున్న బాంబు కల్చరనీ, సినిమాల్లో నానాటికీ దిగజారుతున్న నైతిక విలువలను తూర్పార బడతారు.

మనిషి తన చుట్టూ ఎన్ని అన్యాయాలు, అత్యాచారాలు, అక్రమాలు జరుగుతున్నా, నిర్లిప్తంగా ఉండటాన్ని కవి శ్రీ మురళీ కృష్ణ ఆమోదించ లేరు.

''తామరాకుపై నీటి బొట్టులా ఉండటం మంచిదే

కానీ, నీటిబొట్టు తామరాకుపై ఉన్నంతవరకే దానిసోయగాలు

జారి నీటిలో పడినాక దాని చిరునామా ఎవ్వరికెరుక? అంటారు. ఆంగ్లంలో వచ్చిన **"Plea for Action"** అనే ప్రబోధాత్మక కవిత చటుక్కున స్ఫురణకు వస్తుంది- ఈ పంక్తులను చదివితే!

కవికి భారతదేశమన్నా, హిందూ ధర్మమన్నా ఎనలేని మక్కువ. ''భారతమాతాకీ జై'' అనే కవితలో వేదన నిండిన హృదయంతో -

'' ఈదేశం నాదేనన్న...అభిమానం పుట్టుకొచ్చునా?
నాదేశం కోసం నేను... నిలబడతానను దీక్ష కల్గునా?

అని ప్రశ్నిస్తారు. అలాగే పవిత్రభారతి అనే కవితలో అండర్ గ్రౌండ్ డ్రైనేజీ అన్ని రంగాలనీ కలుషితం చేస్తున్నదని బాధపడుతూనే

''బంగారానికి చిలుము పట్టనట్లుగా
పవిత్రభారతికి నాశనం ఉండదు'' - అని మనసుకు ధైర్యం

చెప్పుకుంటారు **''సనాతనం''** అనే కవితలో

''సనాతన హిందూధర్మం
చాదస్తాల కలగూరగంపకాదు;
సత్యాన్వేషణ చేసి
సంఘానికి ఋజుప్రవర్తనను
నైతిక విలువలను ప్రసాదించినమహనీయ తత్త్వం'..అంటూ

హిందూ ధర్మ ఔన్నత్యాన్ని కవి వేనోళ్ల కొనియాడుతాడు. అయితే -

"నిర్వీర్యమైన హైందవజాతి
నిర్లజ్జగా నేడు పాశ్చాత్యమతవాదానికి
ప్రణమిల్లి, పాదాలు కడుగుతోంది".,

నేడు – "పంచాక్షరి కొందరి ముందర
వంచాక్షరిగా పరిగణింపబడుతోంది."
దీనికి కవి ఖిన్నుడై

"సంస్కారపు చేవ నశిస్తే
నిస్తేజం మనను వరిస్తే
మనజాతికి పరువేముంది?" అని వాపోతారు. మతం మార్పిడి పై కవికి చాలా కినుక ఉంది.

"మైనారిటీ రక్షణకోసం
మత స్వేచ్ఛను కల్పిస్తున్నాం
ఈ కొంచెపుమేలి ముసుగులో
మతమార్పిడులను గమనిస్తున్నాం!" అంటారు అందుకే!

వచన కవితలనేగాక మంచి మినీకవితలను కూడా వ్రాయగలనని నిరూపించుకునేందుకు కవి కొన్ని మంచి మినీకవితలు వ్రాశారు.

" ఎండనీ, వాననీ కాకాపట్టటం
బాగా తెలిసిన మనిషికి
గొడుగూ నువ్వే గుర్తు"
చురుక్కుమంటున్నది కదా యీ కవిత!

" పంతులూ – చాకుల్లాంటి కుర్రాళ్లను చెయ్యబోకు-
గుచ్చుకుంటారు
ప్లాంకుల్లాంటోళ్లని చెయ్ – ఉపయోగపడతారు
దరిద్రదేశానికి!"

ఇందులో వ్యంగ్యాన్ని గమనించే ఉంటారు కదా! కవితకు శ్రీ మురళీ కృష్ణ ఇచ్చిన ఆధునిక నిర్వచనం; ''కాగితాన్ని రేప్ చేసే కైపెక్కిన కలం పోటు'' కవిత్వానికి ఆవేశం ఉండాలన్న సూచన ఒక పక్కన; ఆవేశం పెచ్చు మీరితే అనర్థానికి దారితీస్తుందన్న హెచ్చరిక మరొకపక్కన ఉన్నట్లు స్పష్టమవుతున్నది కదా!

చమత్కార ప్రధానమైన మరొక కవిత **''కపీ తీరా ఏడుస్తా''!**

''అన్ని ఆశలను తీర్చే అమ్మ
ఒక్కసారి రాక్షసియై పోయింది'' –

అంటూ మొదలవుతుంది కవిత. అంతమాట అన్పించుకోవటానికి ఆవిడ చేసిన తప్పిదం ఏమిటా అని చూస్తే –

''ప్రొద్దున్నే చిత్రహింసలతో నిద్రలేపుతుంది;
బోడి చెక్క చేతికిచ్చి, బలపం ముక్క జేబులో వేసి
బడికి పొమ్మని తోసేస్తుంది!''

అలాంటి కవితయే **''ఎలక్షన్''**

''ప్రజాధనాన్ని ఐదేళ్లూ అనుభవించటానికి
పర్మిషనిచ్చేమట్కాజూదం ''ఎలక్షన్''

అంటారు కవి. **'ఎన్నికలు'** అనే కవితలో వాచ్యంగా చెప్పకుండా కవి చెప్పిన యీ భాష్యం చూడండి –

''రిగ్గింగ్ వీరులను మించిన
ఎలక్షన్ టెర్రరిస్టులు
బ్యాలెట్ పెట్టెల్నే మార్చేసి,
దొంగతనం ఋజువైతే
భార్యల్ని పీఠం ఎక్కించి
వెనుకనుంచి ఆమె జుట్టుపట్టి

ఆడించే దర్శక బ్రహ్మల గురువులు!''

వీరజవానులపై శ్రీ మురళీకృష్ణకు ఎనలేని గౌరవం. అందుకే

''స్వతంత్ర భారతి గుండె కవాటం
పరిరక్షించే వీర జవాన్లకు
అందిస్తున్నా నా హృదయాంజలి
స్నిగ్ధ రసామృత పరిపూర్ణాంజలి''

అంటూ నమోవాకాలు అర్పిస్తారు, అణ్వస్త్రాన్ని **''ఫైన్ డెవిల్''** అని పిలుస్తారు -

''అది చేయి చాచితే
చతుర్దశ భువనాల్లో
కోటి అణుబాంబుల పేలుళ్లు'' అంటారు.

అధివాస్తవిక ధోరణిగల కవితలు కూడ ఒకటి రెండు యీ సంకలనంలో కల్పించటం విస్మయాన్ని కలిగిస్తాయి. ''కేసియోడ్రమ్'' ఇందుకు మంచి ఉదాహరణ

''కాళిదాసు మొహంలో ఖత్రోచీ పోలికలు
చోటు చేసుకుంటున్నాయి-
కబేళాకు తెచ్చిన కప్ప
కరీముల్లాకు కాంట్రాక్ట్ ఇచ్చేసింది!
సరోజనీనాయుడు సర్దార్ పాపారాయుడికి
పాప్, రాప్ లు కలిపి నేర్పుతోంది -
అలాంటిదే మరొకకవిత: ''లైట్(ఫ్)మ్యూజిక్''-

''తైవాన్ సన్ మార్కెట్లో
తకధిమి దరువుల తబల
నేలంతా వైట్ వాష

తెలుగు కవి బ్రెయిన్ వాష్

త్యాగరాయగానసభలో

చెంఘిజ్‌ఖాన్ అంగన్యాసం!''

కవి యీ సంకలనంలో అలంకారాల జోలికి ఎక్కువగా పోలేదు. అక్కడక్కడా శబ్దాలంకారాలు మాత్రం వీనులవిందుగా వినిపిస్తాయి -

''రసానంద నిర్మోహోద్భుత సాత్త్వికస్థితి -

నా కవితా హృదయావిష్కృతి'' -

''అరక్షణం విశ్రాంతి లేదు -

అర్థణా సంపాదన లేదు

అయినా -

అహరహం పరిశ్రమే!''

ఇలాంటివి ఎన్నో...

చూశారు కదా! శ్రీ మురళీ కృష్ణ వినిపించిన ఈ **సిరిమువ్వల** చప్పుడు గుండెకు ఎంతహాయిగా అనిపిస్తున్నదో -

ఇలాంటి మరెన్నో ఉత్తమ సంకలనాలు వీరి లేఖిని నుండి వెలువడాలని ఆకాంక్షిస్తూ....

డా॥ పూదిరాజు రామలింగేశ్వరరావు

మచిలీపట్నం,

30.4.2000.



# కృతజ్ఞతలు

నా కుటీరంలోంచి విడచిపెడుతున్న అక్షర సాయకాల పదునును గుర్తించి, విమర్శించి పాఠకులకు చూపెట్టిన భాషామనీషులు, ''ఆముఖము''ను అనుగ్రహించిన శ్రీవేఙ్కటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య **శ్రీ కొలకలూరి ఇనాక్ గారికి...**

కల్లోల కడలిగర్భంలోని సౌజన్యామృతాన్ని కాగడా చేబూని వెతికి, వెలికితీసి పాఠకునికి అందిస్తూ (భావ) ''పులివేట''ని క్రోడీకరించి చూపెట్టిన సహృదయ విమర్శకులు, విశ్లేషణాబృహస్పతి డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం గారికి...

మువ్వల సవ్వడులలో అంతర్లీనమై ధ్వనించే నిశితాస్త్ర సందేశాలను జాతీయభావ విస్ఫూర్తితో విడమరిచి వెలుగు కిరణాలను దర్శింప జేసిన ధిషణాశాలి డా. కసిరెడ్డి గారికి...

త్రివేణీ సంగమం వలె పవిత్రమైన త్రిభాషా పండితులు, మువ్వల సవ్వడులలోని ''సిరి''ని విశ్లేషించిన రీడర్ డా.మాదిరాజు రామలింగేశ్వరరావు గారికి...

కావ్యాంతర్గత సత్య-సత్వ నిరూపణల రూపించినందుకు,

భావగర్భితంగా కవర్ పేజీ చిత్రించి ఇచ్చిన మిత్రుడు ఆమంచి చంద్రశేఖర్ (పెదకళ్లేపల్లి) గారికి...

అందంగా అచ్చొత్తిన ముద్రాపకులకు -గ్రంథ ముద్రణలో సహాయ పడిన నాతమ్ముడు **చి॥ వెంకటేశ్వరస్వామికి...**

ఆ జీవపర్యంతము కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

--- **మురళీకృష్ణ**

# సిరిమువ్వలు

వెన్నెలలో ఎగసిపడే కెరటాలు
అందమైన యౌవని మృదుమంజీరాలు
మెట్టుమెట్టుగా పైకెగసే మురళీరవాలు
అలౌకికానంద రససోపానాలు!

ప్రశాంతవాహినిపై
నావ నడిపే సరంగు భంగిమ
పండువెన్నెలను తినే చకోరప్రతిమ!

గ్రీష్మాతపంలో సెలయేటి ఒడ్డున
నిద్రగన్నేరు నీడన
పిల్లన గ్రోవిని మ్రోయిస్తూ
వేణుగోపాలుణ్ని తలపించే
పశుల కాపరి వైఖరి
నాద బ్రహ్మోపాసనా ఝురి;

కూచిపూడి నర్తకి
కరచరణ విన్యాసాలకు
లయబద్ధంగా శబ్దించే
కంకణ నిక్వాణాలు-
ఆమె జడకుచ్చుల జావళిలో
నినదించే వేదాలు!

సప్తవర్ణవిలసితమై
ఇంద్రచాపభంగిమలో

అక్షర తూణీరాల్ విడచే
నా కవితకు సిరిమువ్వలు!!

లంకా సుబ్రహ్మణ్య ఘనాపాఠి
స్వర లహరిలో ఉరికే పనస పారాయణ
గంభీరమహోదధీ తరంగ
డమరు ధ్వనీ విజృంభణ-
నా అక్షరాల హృదయానుభావ సంకీర్ణవర్ణన!!

మసక వెలుగులో
కెంజాయ స్ఫురించే సరసిముఖంలో
కలిమి లేముల్ని కావడిలో మోసే నా కవితాస్వరూపం
కారుమబ్బుల దుబ్బుల్ని చీల్చుకుని,
గర్జిస్తూ ముందుకురికే విప్లవ చాపం!

మోడువారిన చెట్టునీడన
గ్రీష్మతపానికి విలవిలలాడే
నా కూతురు -
శిశిరాన్ని చింపేసే చిన్మూర్తి స్వరూపిణి!!

వర్షుకాభ్రముల చిత్తడి జడిలో
సాము తడిసి బుసకొట్టేనాగిని-!!

ఘంటసాల కమనీయ గీతాలాపన
పురివిప్పిన నా కవితామృతాస్వాదన!
మంత్రపుష్పాన్ని వీణానాదంలో పలికించే
రసానంద నిర్మోహోద్భుత సాత్త్వికస్థితి;
నా కవితా హృదయావిష్కృతి!!

యోగముద్రతో సకలజగత్తును శాసించే
శ్రీనివాసుని చిద్విలాసం-
నాలో విరిసిన కవితావేశం!
పాణినీయ సూత్రాలకు ప్రభువై నర్తించిన
ఆ సర్వేశ్వరుని కాలిమువ్వ-
శ్రీకాకుళ ఆంధ్రవిష్ణు సన్నిధిలో వేంచేసిన
రాజ్యలక్ష్మి ముంగిటిలో
రసమయనాదం పలుకగ
అమ్మ తాను సవరించి
మలచిన యీ సిరిమువ్వలు
-కళ్యాణపు చిహ్నాలు
లోకానికి తలంబ్రాలు!! (సెప్టెంబరు 1999)



# కలలు

కల కావాలి
కలత పోవాలి-
కలలో తలరాత మరవాలి!
కల తలలో కలత తుడవాలి...

కల ఖరీదెంత?
- ఒక రాత్రి కలతనిద్ర!
కలకు పెట్టుబడి...
తలలో కలత!
కలల ఫలం?
తలపుల పునరావృతం;
అందుకే-
కల కావాలి
కలత పోవాలి...! (1983)



# ఆ కాంక్ష

ఎదగనీ-
నాలో రగిలే స్వార్థపిశాచాన్ని
బాగా ఎదగనీ!
నా హృదయాంతరాల్లో
నిద్రాణమై ఉన్న
దాని అండాన్ని పొదగనీ!!

రెక్కలల్లార్చుకుంటూ
నా ఊహల్లోంచి
దాన్ని వెనువెంటనే వెలువడనీ!
నా స్వార్థానికి
అవధి విధించకు-
నిస్స్వార్థపుటూహలు రానీయకు!!

- ఎదగనీ....
నన్నింకా ఎదగనీ-
ఎదిగి ఎదిగి
బ్రహ్మాండాన్నే మింగనీ!! (1983)





F3

# ఆవేదన

ఈ విశ్వాంతరాళంలో
విరుచుకుపడుతూ-
కాలపురుషుని చోదకత్వంలో
పయనిస్తున్న
రథికుణ్ని నేను!
ప్రశాంత సాగర ఘోష;
ప్రళయ ఝంఝార్భటుల విలయహేష-
నా శ్రుతికి
అవలీలగా వినిపించే భాష!

వసంతాల సంతసాలు-
పౌష్యలక్ష్మి సంబరాలు
విప్లవాల ప్రతాపాలు...
నా మార్గంలో మైలురాళ్లు!!

కర్కశ కరాళ కరాలు
లే చిగుళ్లను చిదిమేస్తుంటే-
మూగగా ఆక్రోశిస్తూ
గులాములకు సలాములిచ్చే
లే గులాబీ స్వాముల బాష్పాంజలులు!
కలవారి వికటాట్టహాస ఘట్టనలకి
వెన్నువిరిగి,
వన్నె తరిగి-

వంగి యీల్గే సగటు మనిషి
సుప్త సంతప్త జ్వాలలు....
ఇంకిపోయిన నా హృదయాన్ని ఛేదిస్తుంటే
నాపయనించే
మహాప్రస్థానపథంలో-
ఎన్నో అపశ్రుతుల గాథలు... ... ... **(1983)**

# టోపీ

కొబ్బరి కాయను
కోసి, పీచుతీసి, పగలగొట్టి, నీళ్లిచ్చి
కొబ్బరి తినిపించాను-
నన్ను
చేతకాని 'వెధవాయ్' అన్నారు!
గుంజు మింగేసి
వెలగపండును
అలా... అలా.. స్టైల్‌గా
అలవోకగా అందించింది గజరాజు;
ఓహ్-
''కింగ్''- అంటే నువ్వే అన్నారు! **(జాగృతి, 1984)**



# కార్చిచ్చు

భీప్రద క్రకచోగ్ర దంష్ట్రాదవానలంలా
విరుచుకుపడ్డ నన్ను చూచి
విశ్వ విశ్వంభరా మండలం క్రక్కదలిపోయింది -
అరుణారుణ
రుధిరజ్వాలారోచిర్నివహోలైన
నా నేత్రాంచల
సమాలింగనంతో
కువలయ వలయం
విలవిల్లాడిపోయింది!
కోటి సూర్యప్రభా భాసమానమైన
నామేథా పరిష్వంగ భంగిమ కాహుతియై
వసుమతీకన్య వసివాడిపోయింది!!
- నేను
నీతిని కాల్చే నక్కలపాలిట కార్చిచ్చును;
కనుకనే
అధర్మ కర్మోన్మత్త ప్రపంచ సంచయానికి
నా ఉనికి విలయం;
నా స్పర్శ ప్రళయం!
అందుకే-
గర్జిస్తున్నా...గాండ్రిస్తున్నా!!

"జయశ్రీ" (1986 జూన్)

# చీమయాత్ర

అరక్షణం విశ్రాంతి లేదు -
అర్ధణా సంపాదన లేదు;
అయినా
అహరహం పరిశ్రమే!

పొట్టకోసం అన్వేషణే -
పిసరంత పొట్టకూ్కడా
ముసిరే వానల్లో
విసిరే గాలుల్లో
కాసిరే ఎండల్లో
ఒకేరీతి సంపాదన -
ఒకేలాటి ఆవేదన!

అవటానికి తను చీమే అయినా
తనకూ చావుంది
తనకూ బ్రతుకుంది -
తనూ సుఖపడాలి;
తనకూ స్వీటు కావాలి!!

చిటుకున నలిపేస్తేనే
చచ్చే యీ అల్పప్రాణికీ
అమ్మో అనిపించే
బలమున్నది ఒకసందు దొరికితే!!

ఈ మాత్రం పాటి విజ్ఞత
తెలియనిదే ఉండదు భవిత
తన శౌర్యం చూపే జనత
విచ్చేసిన నాడే ఘనత!!

గమనిస్తే చీమ యాత్రలో
సందేశం ఎంతో ఉంది
సాహసమూ నెలవై ఉంది
ఆ స్ఫూర్తే కావలసింది!! (1983 అక్టోబరు)

## స్నేహం

శరీరాన్ని పలుకరించకు-
మనసుల్తో మాట్లాడు!
అనుభూతుల్లో భోంచెయ్,
హృదయాల్లో నిద్రపో... ...
-అదే స్నేహం!! (1983)

## అజ్ఞానం

కొబ్బరి చెట్టు
రాత్రంతా చదివింది!
అయినా-
దానికి నేతిబీరకాయ కాయలా!! (1983)

# "చావు..."

ఎక్కడుంది సమత్వం
ఎక్కడుంది స్వాతంత్ర్యం?

రాళ్లుకొట్టి బీళ్లుదున్ని
ఎముకల గంధం తీసి
కామందుల సౌఖ్యానికి
హారతి పట్టే గరీబు-
గంజికి రికమెండేషన్
కోరే యీ దేశంలో... ... ...

ఎక్కడుంది సమత్వం
ఎక్కడుంది స్వాతంత్ర్యం?

తారల హోటళ్లల్లో
తారాశశంక విన్యాసాల్లో
తలమునకలై పరమపదించే
ధనస్వాముల చిద్విలాసంతో
చితుకుతున్న యీ దేశంలో... ... ...

ఎక్కడుంది సమత్వం
ఎక్కడుంది స్వాతంత్ర్యం?

కులంపేరు చెబుతూనే
సౌకర్యాలందించే
కుళ్లుకంపు రాజ్యాంగం

బీదా-బిక్కీ గోడును
చూడదురా ఏమాత్రం!
ఆకలి దారిద్ర్యాలే
పిత్రార్జితమై చెల్లే
ఓకులం పేరు ఉంటేనే
భవిష్యత్తు నిల్లంటూ
చెప్పే యీ దేశంలో
ఎక్కడుంది సమత్వం
ఎక్కడుంది స్వాతంత్ర్యం? (1984 జూన్)

## గొడుగు

ఎండనీ - వాననీ
కాకాపట్టటం
బాగా తెలిసిన మనిషికి
గొడుగూ-
నువ్వే గుర్తు!! (1982)

## దాహం

అణుబంధనాలతో
చుట్టూ సాలెగూడు అల్లుతున్నాడు. ''సైంటిస్టు'';
పిచ్చి పరాకాష్ఠకు చేరగానే
స్విచ్చి వేసుకోవడమే ఇంక నెస్టు!! (1984)

# బానిసోళ్లు

గుండెల్లో
అయిష్టత గూఢంగా పాతుకున్నా -
వెలికి చెప్పేసాహసంలేక
భరించే బలిష్ఠతా లేక -
తలమునకలై
ముప్పైమూడుసార్లు బలవన్మరణంపొంది,
సజీవ సమాధికి చందాలిచ్చుకుని,
పెత్తందార్ల గుత్తాధిపత్యానికి
పేగులు తెంపుకుని హారతి పట్టి
కాకారాయుళ్ల కబంధహస్తాలకి
ఆయువు పట్టుల్ని అంకితమిచ్చి,
చావటానికే రోజూ బ్రతుకుతూ-
చావుకు భయపడే
సన్యాసి జీవులు- బానిస బ్రతుకులు
ఈదేశంలో
ఎన్నో... ... ఎన్నెన్నో...
తరాలు - యుగాలు-
చారిత్రక అంతరాలు
ఎన్నిమారినా
అంతర్యంలో ఉన్న
ఆదిమానవుడు ఒకడే!

కళ్లూ- మెదడూ విడచి

చెవులను కాళ్లుగ మలచి,
బానిసత్వ పంథాల్లో
పయనించే వాళ్లెందరో.. ... .... .
తమవైఖరి మార్చుకోని
తెలివిహీను లెందరో... ...
వాళ్లే యీ దేశానికి చీడపురుగులు
నవభారత నిర్మితికి అడ్డుగోడలు!! (1983)

## విత్తుల్లేవ్

మా బ్రతుకులు
నీకూ్కాడా లోకువేనా జిల్లేడుగింజా!
ఔనులే,
మేం నీలా
స్వేచ్ఛగా తిరగబడలేం గదా!!

(1983)



# ఆదిమ తత్వం

ఆదిమానవుడు
అడవి పందిని కొట్టాడు-
పుట్టగోచీపెట్టి
గుట్టుగా బతికాడు-
అంబూ ఈటెలతోటే
అహరహోలు గడిపాడు!

ఆధునిక మానవుడు
అడ్డొచ్చిన వాణ్ణి కొడ్తున్నాడు
సైన్సుతో బుర్ర తరుక్కొని
సెన్సునే కోల్పోతున్నాడు!
చెకుముకిరాళ్లను
వింతగా విశ్లేషిస్తున్నాడు
ఆడవారి అధరాల్లో
అర్థాంతర న్యాసాల్ని అతికిస్తున్నాడు-
ఇరుగూ - పొరుగూ వారిని చూచి
అసహనంతో,
ఈర్ష్యాసూయలతో
నిప్పులు కక్కుతూ-
ఆరాటపడి లేస్తున్నాడు!
ఎత్తుకుపైయెత్తులతో
విశ్వ వినాశన దిశగా పరుగులు పెడ్తున్నాడు!!

సాంఘిక వినాశన కార్యనిమగ్నుడై
శ్మశాన సామ్రాజ్యానికి
ఏకచ్ఛత్రాధిపత్యం వహించాలని
ఆదిమతత్త్వాన్ని ఆవిష్కరిస్తున్నాడు-
అందుకనే
ఆదిమానవుడు బతికే ఉన్నాడు!
ఆధునిక మానవుడు
ఆటంబాంబు భయంతో
ఎప్పుడో చచ్చిపోయాడు!! (1984 ఏప్రిల్)

# గెలుపు

అత్యంతాధునిక
ఆయుధ సంపత్తితో
అఖిలాండకోటి బ్రహ్మాండాన్నీ
జయిస్తాడు-
కానీ
సుమపేశల
మృదు శలాకమై
సమస్త చేష్టా విన్యాస న్యాసప్రహేళికలకు
మూలకందమై,
బంధుర భావలహరీ ప్రకంపితమై
తనను నడిపించే
మనస్సును
గెలవలేకపోతున్నాడు-
''మని-షి''... ... ... (1984)

# ఫైన్ డెవిల్

అందాలరాశి
సౌందర్యవీచి-
లయహొయలతో
సృష్టికి మత్తెక్కించే
కళల కాణాచి-
''స్వార్థపిశాచి''...
దాని స్పర్శకు
భూనభోంతరాళాల్లో
ప్రళయ జ్వాలలు!
అదికాలూనితే
కాలపురుషుని మెడనున్న
కపాలాల విషలయఘోషలు!
అదిచేయి చాచితే
చతుర్దశ భువనాల్లో
కోటి అణుబాంబుల పేలుళ్లు-
అది పలికితే
సమస్త సృష్టికీ
అనంతాగ్ని జ్వాలా తర్పణం!
అయినా
ఆమె పరిష్వంగమే
అందరి అంతరాంతరాల్లో
అనుక్షణం అలరారేది... ... ...

ఆమె కోసమే
అందరి ఊపిరులు
ఊహా విన్యాసాల్లో
ఉదయాస్తమానం విహరించేది-
ఆమె వశీకరణముందు
జాతి-నిజాయితీ బలాదూర్!! (1983జూన్)

## ప్రజారాజ్యం

రాబందులు రాజ్యం చేస్తుంటే
గుంటనక్కలు తాళం వేస్తున్నాయి!
క్రూరమృగాలు దోచుకు తింటూంటే
సాధు జంతువులు చావును కోరుకుంటున్నాయి!
అవినీతి రాజుల పాలయితే
అధోగతి సామాన్యుల పాలవుతోంది-
- ఇంకా ఏం చెప్పను?
చుక్కలాకాశంలో ఉన్నాయి
సమస్యలు నేల మీద ఉన్నాయి!! (1983ఫిబ్రవరి)



# చైతన్యం

ఎప్పట్నుంచో నిన్ను చూస్తున్నాను-
ఉలకవు-పలకవు;
అందరూ నిన్ను
చైతన్యం లేని 'బండరాయి' అంటారు
కాని
అది అబద్ధం;
ఈలోకంలో
నీతిమాలిన మనుషుల్ని చూసి
బండబారిన గుండెల్ని చూసి
గుండె లోపలి గూండాల్ని చూసి
నువ్వు
బండవారావు!
మా ఖర్మకి
నువ్ యేడ్చి
కొండవయ్యావు-
అయినా
ఏం మానావు నువ్వు?
నీ చైతన్యం లోంచి చెట్లను పుట్టించి
వాటితో మాకు పాఠాలు చెప్పిస్తున్నావు-
మా వంకయినా
చూడకుండా పోయే
మోసాల మొయిళ్లను

నిలదీసి
మా దప్పిదీర్చి ఓదారుస్తున్నావు!
అయినా
నువ్
జవం-జీవం లేని మొండిజాతివే
చైతన్యం లేని బండరాతివే!! (1983జూన్)

## అమావాస్య

స్వేచ్ఛా భారతంలో
బానిస భావాల్ని పోగొట్టి
స్వతంత్ర పౌరుల్ని తయారుచేసే ఉపాధ్యాయుడు-
కార్ఖానాలో గడ్డిపోచకీ
గన్నేరుపప్పుకీ కూడా దణ్ణం పెడుతున్నాడు!
అధికార కారంతో
అహం బలిసిన సాటివాడే
తనని నిలువునా ఆరగించి వేస్తుంటే
చేతకాని సాధుసన్యాసి
యథాలాపంగా ఏడుస్తున్నాడు!
శిల్పే-సుత్తిదెబ్బలు తింటున్నాడని
అలంకార శాస్త్రాన్ని
తిరగేసి రాసుకుంటున్నాడు!! (1983 ఫిబ్రవరి)

# స్వేచ్ఛ

వినీలాకాశంలో
విశాలరోదసీపథంలో
విస్తృతంగా రెక్కలు చాపి
స్వేచ్ఛగా విహరించే
గరుడపక్షిది-
ఎంత సుకృతమో అని
చిన్ననాడు
సంబరపడ్డాను!
నేనూ అలా ఎగరాలని
అంతగా ఎదగాలనీ
ఊహల్లో తేలియాడాను-
కాని, నేడు...
- ఆ గరుడునికీ
కడుపుందని,
ఆ కడుపుకే యీ వెతుకులాటనీ
ఎండ-వానలమధ్య
ఆకలి దప్పుల మధ్య
చావూ-బ్రతుకుల సందున
నాలాగే చిందులాటనీ
నాలాగే కడుపువేటనీ
రెక్కాడితేనే డొక్కాడుతుందని
బ్రతుకు వాస్తవం తెలిసి
భారంగా మూలుగుతున్నా...
- వ్యవస్థపై బుసకొడుతున్నా!! **(జాగృతి, 1984జూన్)**

# ప్రశాంతి

మనిషికి వెయ్యేళ్లాయువునిచ్చే
ప్రశాంతి ఎక్కడుంది?
ఆకలి దప్పుల్లోనా-
ఆహారాన్వేషణలోనా... ...
అలసటలోనా... ఆయాసంలోనా?
హితైషులమంటూ
దగ్గరకొచ్చే దుర్మార్గుల బుద్ధుల్లోనా?
అర్థబాధ్యతను
పంచుకోగలననే అర్ధాంగి అధరాల్లోనా?
కైపెక్కిన
కవిపాదుషా గారి కవితల పఠనంలోనా?
– కానేకాదు;

నీ ప్రమేయంలేకనే
వికసించే కలువబాల కదలికల్లో...
గంభీర సరోవరం చుట్టూ మొలిచి
కలకలనవ్వుతూ
కబుర్లు చెప్పే గడ్డిపరకల కంఠస్వరాల్లో-
పచ్చని పంట పొలాల మీదుగా
పారాడుతూవచ్చి
కొంగులానించి ముద్దిచ్చిపోయే
పైరగాలి బిగి కౌగిలిలో-
అలసిపోయిన ప్రియుణ్ని

అలరించటానికి
ఎరుపెక్కిన సాయం సంధ్యారక్తిమలో-
అర్థరాత్రి తోటనదరగొడుతూ
గుప్పున విరిసిన
విరజాజుల సురభిళ సౌందర్యంలో
సోగకన్నులతో
నాట్యం చేస్తుంది "ప్రశాంతి"!
మానవ మస్తిష్కాన్ని
ప్రక్షాళన చేసే తీయని కాంతి!! **(1984 జూన్)**

# శిల్పి

గాఢాంధకారంలో
ఒంటరిగా
కారుమబ్బులమధ్య
గంగరావి చెట్టుకింద
తన్మయత్వంలో గిటార్‌పై.... ... ...

దూరంగా
కంటికి కనిపించని
సృష్టిని తాకని
అలౌకిక సౌందర్యమూర్తికి-

ఊహల్లో
ఊసులాడే నవోఢకు-

గూఢంగా సమర్పించే
స్వర నీరాజనం!

ఎన్నాళ్లో
ఎన్నేళ్లో తెలియని
హృదయ నివేదన-
తీరని ఆవేదన!! (1984 మార్చి)

## మనకెందుకు?

మబ్బులు కురుస్తున్నాయ్
నదులు పారుతున్నాయ్!
నేల పండుతోంది
పొట్టనిండుతోంది;
- అయినప్పుడు
మనం నీతిమాలితేనేం? (1987)



# కాస్మటిక్స్

ఎన్నెన్నో
సౌందర్య సాధనాలు వాడి
చివరికిలా తయారైంది "ఈతముక్క"!
యౌవనంలో
బాగానే ఉండేది-

ఎటొచ్చీ
పుష్పవతయ్యాకనే యీ గుబులంతా!
అక్కడికీ
నాలుగు పిందెలు వేసి
వంధ్యాదోషం పోగొట్టుకుంది-

ఇప్పటికీ
మేకల వాడొస్తే
షేపులు గీయించుకొని
సెక్సీగానే తయారవుతుంది!
ఎన్నితంటాలు పడితేమాత్రమేముంది?
వ్యభిచారిణిలా
ఊరిబయటనే కొలువుండాలి!

సీజన్లో
చిద్విలాసం చూపించాలి!
పాపం!

బయటికెంత దిగజారినా

రోగగ్రస్తమైన తన శరీరాన్ని చూసుకొని
మనసులో విలవిలలాడిపోతుంది
ఈతముక్క-
దాని తలరాతమాపే
గురజాడ ఎవ్వరు? (1983)

# సుకృతం

ఈ పంటకాలువ గట్టున
ఇలా 'గరిక' వృక్షంగా జన్మించటం
నా పూర్వజన్మ సుకృతం!
ఈ కాలువలోని అలల జలకన్యలు
అమలిన శృంగార రసాధిదేవతలు!!
అహర్నిశలూ
కైపెక్కిన పిల్లవాయువులు!
నన్ను పలుకరించి
గిలిగింతలు పెడుతుంటాయి!
నా సంసారం
నవ నవోన్మేషం-
ఈతి, కోతి, నాతి బాధలు
నా కేవీ లేవు!!
ఉన్నదల్లా ఒకటే బాధ-
ఇంత సుఖమూ
నేనొకణ్ణే

ఎలా అనుభవించేదా అని!!
-అయినా
'' గరికవృక్షం''గా జన్మించటం
నా పూర్వజన్మసుకృతం!!! (1984)

## కార్ఖానా

భావాలరేటు బాగా పెరిగిపోయింది;
ఎలాగోలా
ఖరీదుచేసి
ఫ్రేములో బిగించినా
ఎంత మాత్రం
గిట్టుబాటు కావటంలా!
సందు సందునా
పసందు రసం పిండి వండినా
కవితల గారెలంటే
ఖాళీలేని
మానవ మస్తిష్కాలకి
విరసం
కుబుసం విడిచినట్లవుతోంది!
అయినా,
కలానికీ
మెదడుకువేసిన కళ్లేనికీ
కీళ్లు బిగియకుండా ఉంటానికే
చేస్తున్నా
యీ కవితా కసరత్తు!! (1986)

# క్విజ్

మాసిన
వెలిసిన
పాతకోటు
నిజాయితీ!
మెరిసే
రోల్డ్ గోల్డ్‌నగ
అవినీతి!!
- తెలివిగా
నాణ్యమైనది
ఎంచుకో; **(జాగృతి, డిశంబరు 1985)**

# చౌకడిపో

భారతీయ మార్కెట్లో
ప్రాణం ఖరీదు ఒక సెకను;
భద్రత ఖరీదు ఒక బాంబు-
శీలం ఖరీదు ఒక సినిమా!! **(1982)**



# సంస్కారం

పాండీ బజార్లో
పగలూ-రాత్రీ పావడాల బేరం;
అడయార్‌లో
బంజారా రేసుల బ్లాకెండ్వైట్!
అంతటా ప్రవహించేది
పెరియార్ నదే!! (1983)

# పదివేలు

పశువు
ఏ గడ్డితిన్నా
మనక్కావలసింది
గంటెడు పాలు!

మనిషి
ఏ నడత నడచినా
తనక్కావలసింది
లక్షల రూపాయలు!!

న్యాయం- ధర్మం
పనికి మాలిన ముళ్లకంచెలు;
-అభివృద్ధి
నిరోధ్‌కాలు! (1985)

# అశ్వమేథం

అసూయా పరుల్ని
అర్ధమానం వదులుకున్న అర్భకుల్నీ
ఆచ్ఛాదన లేకుండా తిరిగే
అసత్యవాదుల్నీ
అహరహం తుదముట్టించటానికి
అక్షరాలతో
అశ్వమేథం చేస్తున్నా!
ఆహోకారాలతో
అందరూ విచ్చేయండి- (1986)

# వైకుంఠపాళీ

పూర్వం ధర్మదేవతకు
నాలుగు పాదాలట;
ఇపుడు-
అది ఒక నిరోధ్ బుడగ!
అవసరార్థం
వాడుకుని పారేసే
ఖాళీ బెలూన్;
అవకాశం కలిసొస్తే-
అసలుదాంతో పనేలేదు;
ఎకా ఎకీ
వైకుంఠపాళీయే!! (1986)

# భయం

దారి తప్పుతున్న
సమాజానికి
ఎమర్జన్సీగా
కావాల్సిన మందు-
భయం !
అదిలేకపోతే
రేపు పుట్టేవాడు కూడా
రెండు పీకలు నొక్కేసి
పుట్టేస్తాడు!! (1982)

# వేదాంతం

పదవి
ఊడి నప్పుడు-
పెళ్లాం
వొదిలేసినప్పుడు-
బానిస
బనీను పుచ్చుకున్నప్పుడు-
ఆసరా
టుపుక్కున తెగినప్పుడు-
గుర్తొచ్చే
చేదు త్రేన్పు!! (1987)

# ఉష్

తనకన్నా
ఎదటివాడిలాభం
పరమ అన్యాయం!
తనకన్నా
ఎదటివాడిక్షేమం
పరమ అసహ్యం!

సమాజం
పురోగమించాలంటే-
తానొక్కడే బాగుపడాలి;
పదిమందీ
సంతోషించాలంటే
తానొక్కడే సుఖపడాలి;
– ఇది
సామాజిక జీవ రహస్యం
– ఇది శాశ్వత సత్యం;
ఉష్... ...
మనసుల్లోనే ఉండాలి!

(1987)



# కవిత

కాగితాన్ని
రేప్ చేసే
కైపెక్కిన
కలంపోటు! (1988)

# కళ

లేని
ఒంపు సొంపుల్ని
అతికించుకుని
తైతెక్కలాడటం-
లేని
విలువల్ని
అడ్డం పెట్టుకుని
ఆఖరిదాకా
అభినయించటం-
లేని
వలువల్ని
ఎగదోపుకుంటున్నట్లు
హైరానపడటం-
ఓ
పెద్దకళ!! (1987)

# స్వాతంత్ర్యం

భారతదేశ స్వాతంత్ర్యం
మహాత్మాగాంధీ బోసినవ్వుల్లో ఉంది!
అర్థదిగంబరత్వంలో ఉంది–
చేతికర్రలో ఉంది;
చిన్ని పిలకలో ఉంది.
– కాని,
ఈకాలంనాటి
ఏ పౌరుని మెదడులోను లేదు–
నడవడిలోనూ లేదు;
కుడి ఎడమల్లోను లేదు!
ఒడిదుడుకుల్లోను లేదు;
వీరికున్నదల్లా
నోరుగలవాడి వెనుక
అడుగులో అడుగేసుకుంటూ
గాడి తప్పకుండా
నడువగల్గిన
క్రమశిక్షణ గల బానిస విధానం
హద్దుల్లో సద్దుమణిగే
అతి దౌర్బల్యం!! (1986)



# మెదడుంటే

గోతాల్లోని
గింజల్ని
కళ్లతో తినేసే వాళ్లొచ్చారు!
- కాళ్లీడ్చుకుంటూ
పోవట మెందుకు? (1987)

# మాయావతి

సహజత్వం లెవెలు
జీరో
మాయాతత్వం లెవలు
సుప్రీం హీరో!! (1987)

# అవార్డు

పంతులూ
చాకుల్లాంటి కుర్రాళ్లను
చెయ్యబోకు-
గుచ్చుకుంటారు;
ప్లాంకుల్లాంటోళ్లను చెయ్-
ఉపయోగపడతారు
దరిద్ర దేశానికి!! (1988)

# కాటా

ఏడంతస్తుల పైకంటా పెరిగి
పిచ్చిమొక్కలు పీకుతూ-
లొల్లాయి పాటలు పాడుతూ
పెట్టాడొకకేక-
''నే నొక కవి నె హె...''
నేలమీద గడ్డిదుబ్బుల్లో
భూతద్దాల కళ్ళజోడును
దారాల ఆధారంతో
వేళ్లాడేసుకుని,
ఏదో వెతుక్కుంటున్న
''డైలీ'' కబుర్ల తాతమ్మలు
చూపానకుండానే...
సన్నగా కూస్తున్నారు-
''కామోసెహె!''
- అంతే..
ఏ పేపర్లో చూసినా
బస్తాలకి బస్తాలు కవితలే!!　　　(1983)



# బ్రేక్‌ఫాస్ట్

దేశంలో
కరువు పెరుగుతోంది-
అబద్ధం!
జనానికి
ఆశ పెరుగుతోంది-
యదార్థం! (1987)

# కసితీరా ఏడుస్తా

అన్ని ఆశల్ని తీర్చే అమ్మ
ఒక్కసారి రాక్షసియైపోయింది
ప్రొద్దున్నే
చిత్రహింసలతో
నిద్రలేపుతుంది!
బోడి చెక్క చేతికిచ్చి
బలపం ముక్క జేబులో వేసి
బడికి పొమ్మని తోసేస్తోంది?

అమ్మ -
బండబారిపోయింది!
జాలి ఎండి పోయింది;
ఇష్టం వచ్చినట్లు తిరగాల్సిన నన్ను



F5

కష్టాల ఊబిలోకి దించుతోంది;

అమ్మలో ఎంత మార్పు?
పంతులు చెప్పే ఆత్మజ్ఞానాన్ని
అమ్మే చెప్పొచ్చుగా...
తనవల్ల కాదని నన్ను తగిలేయటం-
అడ్డు రాకుంటానని అవతలికి నెట్టటం
అమ్మకి న్యాయమేనా?
అయినా సరే -
అమ్మ నెట్టేయగానే నేను వెళ్తానా?
ఇంట్లోంచి అయితే నెట్టిందిగానీ
నేను బడిలో కూర్చుంటానా?
బజార్లలోనే తిరుగుతా-
గుండీలు తెంపుకొని,
గొంతంతా చించుకొని
జుట్టంతా పీక్కొని
ఏడుస్తా!
నా ఇష్టం వచ్చినంతసేపు
ఏడుస్తా...
కసితీరా ఏడుస్తా-
కచ్చి తీరేక,
తిరిగ్గా మళ్ళీ అమ్మ దగ్గరకే వస్తా!! **(12.3.89)**



# బహుమతి

న్యాయాన్ని
చంపిన వాడికి -
తతిమ్మా
అపరకర్మలపూర్తికోసం
ఇచ్చే అనుమతి పత్రం-
బెయిలు! (1998)

# ఎలక్షన్

ప్రజాధనాన్ని
ఐదేళ్లూ
అనుభవించటానికి
పర్మిషనిచ్చే
మట్కా జూదం! (25.8.99)

# జలసుందరి

నోరులేని పక్షిగా
మమ్మల్ని అందరూ అనుకోవచ్చు;
కానీ,
మాకున్న తెలివి
ఎంతమందికి తెలుసు?

జలాశయంలో ఈదేటప్పుడు-
ఎంచక్కా-
నలుగురం ఒకే వరుసలో
ముక్కోణాకారంగా
అలల వయ్యారాన్ని ఇనుమడింపచేస్తూ-
తీయని ఊహల్ని రవళింపచేస్తూ,
మా వెనుకపొంచి ఉన్న
మబ్బుల గుబ్బలు
గుబులుతో మా వెంటనే కదిలివచ్చేలా చేస్తూ-
వినీలాకాశపు దోబూచుల్ని
అలల విరుపుల్లో
ప్రతిఫలింపచేస్తూ-
హృదయం పగిలిన ఎడారి జీవుల్ని కూడా
మాతోపాటు పలుకరిస్తూ-
మూగతనానికి భాష నేర్పుతూ,
వయ్యారానికి పైట సర్దుతూ...
సరిగమలకి అడుగులు నేర్పుతూ-
మురళీరవానికి మెరుగులు దిద్దుతూ...
ఇంద్రచాపానికి పరిమళాల నద్దుతూ,
మా పయనించే ప్రణయ లాహిరికి
కనువిందు పొందని కలువబాల లెవ్వరు? **(12.3.98)**



# సుఖీభవ

పదాలు విరుగుతున్నాయ్
పెదాలు చిట్లుతున్నాయ్
పద్యాలు పారిపోతున్నాయ్!

దయ్యాలు వేదాలు వల్లిస్తుంటే
కసితో కంకాళాలు కాలిపోతున్నాయ్
నాగరకత నవ్వుల పాలవుతుంటే
నరనరాలు ఆక్రోశంతో త్రెళ్లుతున్నాయ్!!

అన్యాయం కేబరే చేస్తుంటే
అవినీతి 'ఎయిడ్స్' ను పెంచుతుంటే
పాతివ్రత్యం పాతాళంలో కుళ్లుతోంది-
పదిమంది చేతుల్లో సామూహికంగా
నలిపివేయబడుతోంది!

మేధావులారా
నేతిబీర పేరును మార్చుకొని
ఊసరవెల్లుల ఊసును
ఇకనైనా మరవండి!! (మార్చి 1999)



## ప్రజాసేవకులు

చట్టసభలో
అడుగుపెట్టే ఛాన్స్ వస్తే చాలు!
బుర్రనుపయోగించి
ఏదో ఒక ''స్కాం''లో
దిగబడొచ్చు-
కుబేరుడితో పోటీ పడొచ్చు!!
కాని
''ప్రజాసేవ'' అనే మాస్క్‌ను మాత్రం
తగిలించుకోవాలి! (జూన్ 1999)

## కారణజన్ములు

భయంలేదు భయంలేదు
బద్మాష్ బ్రతుకులు భద్రం!
స్వర్ణోత్సవ నీడలలో
మీ ఖాతా బహుభద్రం-
''నేర చరిత్రులు'' అంటే
అందం: హుందా డానోయ్;
కారణజన్ములు మీరే
అంటే భేషుగ ఉందోయ్!!

లోకం నేరాలమయం
అయిపోతున్నప్పుడు మీ

అవసరమెంతో ఉంది,
ఆదరణా మీ కుంది!

అందుకె మీకు సుభద్రం
కాకుంటే ఇల ఛిద్రం!! (1999)

# కేసియోడ్రమ్

సత్యహరిశ్చంద్రుడు
కాటిసీనులో చచ్చిపోయాడు-
కాళిదాసు మొహంలో
ఖత్రోచీ పోలికలు చోటు చేసుకున్నాయి!
కబేళాకు తెచ్చిన కప్ప
కరీముల్లాకు కంట్రాక్ట్ ఇచ్చేసింది;
సరోజినీ నాయుడు
సర్దార్ పాపారాయుడికి
సంగీతం పాప్ రాప్‌లు కలిపినేర్పుతోంది;
వివేకానందుడు
మాష్టర్ ఇ.కె దగ్గర
క్వాంటిమ్ థియరీ నేర్చుకుంటున్నాడు!
నల్లసూరీడు
గాజా సర్దార్ గడ్డం గీస్తున్నాడు... ...
బిల్లుక్లింటన్‌కి చిల్లుపడి
డెక్కన్ క్రానికల్‌తో అద్దుకుంటున్నాడు -

చెన్నై సాంబార్
జాంజిబార్‌లో శరద్‌పవార్‌పై
కోల్డ్‌వార్ మొదలెట్టింది;
ద్రవిడ యూనివర్శిటీ ప్రొఫెసర్
తక్కతై రీసెర్చితో
ఐరన్‌లెగ్ అవుతున్నాడు;
ఆర్మీనియాలో అర్ధణాకోసం
అతగాడు ఆరంగేట్రం మొదలెట్టాడు-
ట్యునీషియా తుప్పుకలంతో
విరుగుడు పదాల్ని నంజిపెట్టి
హైద్రాబాద్ కవి
సాహిత్య అకాడెమీ అవార్డుల్ని
నరుక్కుంటున్నాడు!
తామరసోకిన పాఠకులెందరో
కాగితాలపై ఇంకేసి
కవి కవులై పోతున్నారు;
- ఈ కవితకి
అవార్డు రాకపోతే
యూకోజిన్నా మొనాలిసాని చింపేస్తాడు!
డోనాల్డ్ డక్ మెక్డొనాల్డ్‌లో మునిగిపోతాడు;
ఆధ్మర్టన్ సెబాస్టియన్‌తో
ఒథెల్లో టైప్ ట్రాజెడీ ఆడేస్తాడు-
సో... ...
ప్లే యువర్ కేసియోడ్రమ్!! **(మార్చి, 1999)**

# వీరకిరీటి

మహాత్మాగాంధీ
ఓ బడా మతతత్త్వవాది!
సంకుచితత్వంతో
విదేశీయుల్ని వెళ్లగొట్టాడు;

రాజ్యాంగ నిర్మాతల
ఉదారవాదం వలన
ఓ విదేశీగాంధీ
నూరుకోట్ల ఇండియన్‌లకు
నూర్జహాన్ అయ్యింది!

ప్రాంతీయ దురభిమానాలను
పక్కకు బెడితే-
బిల్‌క్లింటన్ ఒక విశ్వవిజేత;
భారతీయులందరికీ
భరోసా యిచ్చే ఋణదాత!!
స్వాతంత్ర్యం -
శుద్ధకల్తీ పదార్థం;
ఎవడికైనా
కాళ్లొత్తటమే
దానికి సరైన అర్థం;
కోట్లు మింగినవాడి ప్రాణం నిలవాలంటే
జాతీయ భద్రత తాకట్టు పడాల్సిందే!

ఈ దేశంలో
రాముడు, కృష్ణుడు కూడా
పక్కా మతతత్త్వవాదులే!!
పరలోక మార్గాన్ని చూపే
పరమ ప్రభుదాసులే-
ఏమైలలేని లౌకిక వాదులు!
అవసరాలనుబట్టి
శబ్దార్థాలను మార్చుకోగలిగితే
కిరీటం ఎప్పుడూ
ఒకగుండు మీదనే ఉంటుంది! (1999)

## సాధువుగా బ్రతుకు

దేవుడిచ్చిన బుద్ధికి
గడ్డిమేపకు-
యథాలాపంగా వెఱ్ఱిని
ఆహ్వానించకు!
బతికినంతకాలం
బుఱ్ఱను హింసించకు-
చచ్చేటప్పుడు కూడా
కసితో కవ్వించకు!!
సాధుజీవితంలో ఉండే
సాత్త్విక ధర్మం తెలుసుకో-
సత్యాహింసలతోటే
సాంగత్యం పెంచుకో!! (1999)

# లైట్(ఫ్) మ్యూజిక్

పప్పు ముద్దకి
పనికిరాకున్నా
ఫైవ్‌స్టార్ హోటేల్ కావాలి!
రన్నింగ్ బీట్‌లో
రసమయి లయించాలి-
అప్పుడే పాప్‌తో రాప్
రేపుకో పాప
టిప్పు టాప్పు స్టెప్పు;
కలం కౌగిట్లో కమీనయ కామకేళి
తెల్లకాగితంపై తిరగబడ్డ ఘరానా గురివిందవాహ్యాళి!
'పలమనేరు' పాప పైట పిన్నులో పస
సినీకవి గేయాల రుసరుస-
అర్ధరాత్రి జారిపడ్డ అడుగు లంగా జాతర;
మినీకవి సరసానికి
ముక్కెర జారిన పద్యం;
తైవాన్ 'సన్' మార్కెట్లో
తకధిమి దరువుల తబల
నేలంతా వైట్‌వాష్-
తెలుగుకవి బ్రెయిన్ వాష్!
త్యాగరాయ గానసభలో
చెంఘిజ్‌ఖాన్ అంగన్యాసం;

సంప్రదాయ వారధిలో
సైతాన్ సణుగుడు సంగీతం
మేధను మింగేస్తుంటే
మురళియె బరువుతోంది-
నాదం కరువవుతోంది...,
మ్యూజిక్ లైటవుతోంది!! (మే 1999)

# నైటీ తొడుక్కో

ఎన్‌టిపిసీ తవ్విన కంగారు గోతిలోంచి
ఎకా ఎకి వచ్చిందొక ఏలికపిల్ల!
ఒళ్లంతా గుల్ల చేసుకుని
ఒంటరి వయ్యారంతో
వసుంధరని అమ్మేస్తానని
విశాఖ సంతలో
వింతమృగంలా కాలరెత్తింది;
హోరుగాలి చింపేసిన జీవితాన్ని
సోనియా కౌగిట్లో నలిపేసి
రాత్రంతా నిద్రపోయింది-
నగరం నడిబొడ్డు కింద తిన్నగా గురిచూసి
గుండ్రంగా జెట్టీగొడ్డు కాటేసింది!
అయినా -
ఉప్పెనకింకా టైముంది;
బీడీకట్ట చెవిలోపెట్టి

సాహిత్యోపాసన మొదలుపెట్టు;
అమ్మోరు ఫూనేలోగా
అరిసెప్పచ్చి తినొచ్చు!
అప్పిచ్చిన సేటుకొడుకు
అదిలాబాద్ రేంజిలో షాపింగ్ కెళ్లొట్ట!
క్లియోపాట్రా రాగానే
అటుకులు చెవిలో పోస్తా;
దాసరి చైతన్యరథం మీంచి
ముద్రబాబును దింపేస్తా!
అందాకా
నైటీ తొడుక్కో -

**(జూన్, 1999)**

# పోయెస్ గార్డెన్

అధికారపార్టీలో
ఏషియన్ గేమ్స్ విజృంభించాయి!
పొఖారన్‌లో పుంఖానుపుంఖంగా
నోస్టల్ పౌడర్ రాలిపడుతోంది-
కృష్ణవేణి
పెరియార్‌తో నిండిపోతోంది!
కన్నడ వీరప్పన్
మైసూర్ గల్లీలో కర్రంబిళ్లాడుకుంటున్నాడు;
జయ - మాయ- సోనియా
వందకోట్ల కడుపుల్లో

చుంచెలకళ్ళి విడుస్తున్నాయ్;
ఎబిసిడి నేర్చిన తెలుగుకవి
శామ్యూల్ టేలర్ కాలరిడ్జ్ స్టయిల్లో
కవితలు ఊదేస్తున్నాడు
మిణుగురుల్లాంటి మెరుపుపెదాలతో
మినీ కవి
నిర్లజ్జగా తెల్లకాగితాన్ని
'రేప్' చేస్తున్నాడు
జీర్ణంకాని ఎరువు సొమ్ముతో
''స్కాం'' బశివుడు
పోయెస్‌గార్డెన్ నీలికాంతుల్లో
పురుచ్చితలైవి-
ఇన్‌సైడర్ ఇన్‌సెట్లో
ఇరకాటాల పా..వె.న
జనారణ్యంలో అతుల విహారవాజపేయం!
నరమేధంలో అధికారం
భారతీయుల నిర్వేదం;
బాబాసాహెబ్ బాకా భజంత్రీ
భరతజాతి సొమ్నాంబులిజం!
పవర్‌సీన్‌లో డంకన్ ఘోస్ట్
విశ్వనాథ కవితలు వేస్ట్...
స్కాచ్ విస్కీ క్వార్టర్ బెస్ట్-
ఇంద్రసభలో ఎవర్‌లాస్ట్
కల్చరల్ హెరిటేజ్ మా తాతకిచ్చేయ్
నల్లమందు నాకు చాలు;

జొనాథన్ స్విఫ్ట్ కథలు,
యండమూరి ట్రెండ్ విండ్స్ నా ఆశల గుబ్బాలు!
ట్రాయ్ హెలెన్, ముంబయ్ హేమ
మా కలల ఆధారాలు – మా సుషుప్తి మందారాలు!!
( ఏప్రిల్ 1999)

## ''సిప్ సిప్ హుర్రే...''

శ్రీశైలంలో సిఫిలిస్
నందీశ్వరు డొక టెర్రరిస్ట్
భయము – భక్తీ లేని
ఆకతాయిలకు ఇది ఘోస్ట్!

నీతి జాతి విడచే
బదనామ్ వీరలకిది లాస్ట్;
ప్రజలధనం తినమరిగి
నిత్యవసంతాలాడే
మేడమ్‌గాళ్లకు ఇదినెస్ట్;
యమకింకరులకు జడియని
యమహో వీరుల పాలిట
'యేరా' గ్లాసుల చూపే
యెర్రని ''హెల్'' ఇది ఫస్ట్!
శాటన్ పూనినవారికి
చేతన చచ్చిన వారికి
వలువల నూడ్చేవారికి

తులువల కొలిచేవారికి
మెళకువ గూర్చును ఇది జెస్టు!
వేదాంత అనంతాచార్యులు పెట్టే
పంచశిఖల మధ్యన పిలక-
పెషావర్ ఫేస్ కటింగ్‌లో
పంచాక్షరి జప సందోహం;
ఎన్‌సీపీ గానాంబుధిలో
వాణీ జయరాం తుంబురనాదం!
పొలకమారిన ఎం.పి, లంతా
చిదంబరానికి తగు జతగాళ్లే.,
శ్రీశైలం చిరునామాతో
సింహాద్రికి వెళ్లండర్రా
శామ్యూలుకి దణ్ణం పెట్టి
శబరిమలై సామికి మొక్కి
డయనోరా స్విచ్చిని నొక్కి
కాష్మోరా పీడ వదిలించుకోండి-
శ్రీనివాసుని రక్ష ఏపించుకోండి!! **( ఏప్రిల్, 1999)**



# నయా మంజిల్

పార్లమెంట్ సెంట్రల్ హాల్లో
పతంజలి పారాహుషార్!
నహుషప్రశ్నకుజవాబిమ్మని
నానాపటేకర్ డిమాండ్... ...

నాజీలు,మాజీ మెంబర్లు
మల్హోత్రా మాతామహులూ
మాథోల్కర్ మానసపుత్రులు
మైమెన్ఖన్నా మనోజభవులూ...

మార్వాడీ మసాజ్మత్తుకి
మై మరచే మర్యాదస్తులు
సామాన్యుడి సత్తువకోసం
నోరెత్తని మూర్జహాన్లు...
బెర్నార్డ్షా మాసినగడ్డం
బందరులో రోడ్డుకి అడ్డం-
తాలింపున మాడిన ఇంగువ
మనిషా కొయిరాలా ముఖకవళిక.. ...
జానపదం గెంతే జయప్రద
డూడూ బసవన్నకు పోలద?
కేంద్రంలో కిచడీ ప్రభుత
బృందావన సరసుల ఘనత;
ఎదురొచ్చిన తెల్లమొహానికి
ఏదో చెప్పేద్దాం రాత్రికి!

కాన్వెంటుల చిలక పలుకులు
ఖద్దరునే కబళిస్తున్నాయ్,
అమ్మా అని పిలువ జాలడు-
మమ్మీ అని ఫోజిస్తాడు!!
దుఃఖం అను రెంటి మధ్యనే
కవితాంబుధి ఉందన్నాడు,
అక్షరమే లేకుండా బహు
భావాలను చూపించాడు!
మినిమమ్మనిపేరు తొడుక్కొని
మెనిఫోజులు విసిరేస్తావు-
నీదీ ఒక కవితే నంటావ్
కవి పరువును మంటకలుపుతావ్!
విలువలనే బయటకు నెట్టి
3-డి సినిమా చూపిస్తావ్!
నైపుణ్యం నీ సొమ్మురా
నాదిర్షా చిన్నపోవురా...
నవయుగ కవి చక్రవర్తికే
నయగారం నేర్పగలవురా!! (జూన్, 1999)



# శిక్షాస్మృతి

వందమంది దోషులు తప్పించుకున్నా
ఒక్క నిరపరాధి కూడా
శిక్షింపబడరాదనేది
మన శిక్షాస్మృతి ఆదర్శం!
అవినీతి - అన్యాయం
సర్వత్రా రాజ్యమేలుతున్నా
ఎవ్వరికీకళ్లు- చెవులూ
పనిచేయటం లేదు;
దోపిడీ చేయటం - చేయబడటం
యుగధర్మంగా చెలామణి అవుతున్నాయి!
దోషాలు నమోదు చేయటం
విచారణలు వాయిదా వేయటం
వీలైతే అప్పుడప్పుడూ
ఓ జన్మాంతానికి -
అప్పీలుకి చోటిస్తూ తీర్పుచెప్పటం;
శిక్షాస్మృతి పథంలో
లీలగా కన్పించే మైలురాళ్లు!
చరిత్రకాలంలో ఒకవర్గం ప్రజలు
ప్రపంచమంతటా చెలాయించిన
లోకాతీత ప్రాధాన్యతని
ఇప్పటికీ
ఇంకొందరు అనుభవిస్తూనే ఉన్నారు;

శిక్షాస్మృతి మాత్రం
మౌనప్రేక్షకునిగా యుగాలను గడిపేస్తోంది;
అన్యాయం చేతిలో
పరాభవాన్ని తప్పించుకోవటానికి
ముఖం చాటుచేసే బలహీనుడి మాదిరిగా
న్యాయ వ్యవస్థ కాలచక్రానికి బందీయై
కేలండర్ పేజీలు తిప్పేస్తోంది!
తీర్పుల్ని నత్తిమాటల్లో - తికమక పేచీల్తో
నలిపి చిత్తుబుట్టలో పారేస్తోంది-
సనాతన న్యాయ వ్యవస్థ
హూణుల కాళ్లకింద ఏనాడో నలిగి చచ్చిపోయింది;
ఇవ్వాళ దాని అలంకార భవనాలే
వెక్కిరిస్తూ అగుపిస్తున్నాయి!



# ఎన్నిక(ల)లు

నూరుకోట్ల భారతీయులు
తననే 'నాథను'గా ఎన్నుకొని
హిమాలయాల్లో కుర్చీవేసి కూర్చుండపెడతారని
ఆఫ్రికా జాతీయులకి
మధ్యధరా మాండలీయులకి
ఎన్నికలలు?
ఇంద్రుడికి స్వర్గంపై భక్తి లేదుకనుక
స్వర్గాన్ని రక్షించాలని వచ్చాడట హిరణ్యాక్షుడు-
దేవలోకంలో ఓటింగ్ పెడితే
మహిషాసురుడే మాపాలి ప్రభువని
ముక్కోటి దేవతలూ మొరపెడుతున్నారని
వేలాది శుక్రాచార్యుళ్లు సైబాల్ రాసుకుని
తీర్పు చెబుతున్నారు-
భారతీయ సింహాసనంపై
ఎందుకూ పనికిరాని ఆతతాయిలకు
ఎందుకో అంత దురాశ!
రిగ్గింగ్ వీరులని మించిన
ఎలక్షన్ టెర్రరిస్టులు
బ్యాలెట్ పెట్టెల్నే మార్చేసి
దొంగతనం రుజువైతే
భార్యల్ని పీఠం ఎక్కించి

వెనుక నుంచి ఆమె జుట్టుపట్టి ఆడించే
దర్శక బ్రహ్మల గురువులు
ఎంతో గడ్డి తినొచ్చని,
ద్రావిడ భూముల్ని అరిగించుకోవచ్చనీ
కలలు కంటూంటే
ఆ జీవాంతం ట్రస్టీల కిస్తీలను
దివ్యంగా సేవించవచ్చనీ -
సిసిలీలో పుట్టిన చిన్నరోమానిక్కూడా
ఎన్ని కలలో!
ఔనుమరి
ఇండియాలో ఇండోర్‌సత్తా చిత్తైతే
రోమాలే రాజ్యాలేల వస్తాయంట!!
ఆమెన్!!

## నగరం నిద్రలేచింది

ఖుషీ ఖుషీగా రాత్రిని అనుభవించి
బద్ధకంగా నిద్రలేచింది మహానగరం -
టక్కుటమారాల్ని కొత్తకోణంలో ప్రదర్శించి
అలసిపోయిన నాజూకుదనం
గజకర్ణ గోకర్ణసంకీర్ణంకోసం
మళ్లీ ఒళ్లు విరుస్తోంది!
చీకటి ముఖాన్ని చన్నీళ్లలో ఝూడించిన

ఉషోదయం

పరధ్యాసగా పారువేటకు బయలుదేరుతోంది;
కనకమహాలక్ష్మి షూటింగ్‌కి
షట్టరులెత్తే పుణ్యాత్ముల హడావుడి చూసి
ప్రాతఃకాలం ఆవులిస్తూ అగ్రులు చాస్తోంది-
సముద్రపు కెరటాల్లా
సంపద విరుచుకుపడాలని చేసే సుప్రభాతసేవ
అలల తిరోగమన వేగాన్ని
విస్మరిస్తోంది;
నాణెంపై బొమ్మను మాత్రం ఆశిస్తూ
బొరుసు గడుసుకు జడిసిపోతూ
అది అడుగునే ఉండాలని తొక్కిపెట్టి
తెలివితేటలతో పరుగుమొదలెట్టింది నగరం!
కంప్యూటర్లలో లేని అందచందాల్నీ,
వెలుగునీడల్ని- ఊహాపోహల్ని - ఉసురువిసురుల్ని
విలక్షణ సాఫ్ట్‌వేర్ కవరేజితో
విచిత్రంగా మేళవించిన చిత్రకారుడు
వీడియోగేమ్‌కి తెరలేచిందంటూ
తట్టి లేపుతున్నాడు మహానగరాన్ని;
లక్షలాదిపాత్రలు వినూత్నవేషాలతో
విపరీతవేగంతో
కొత్త సంపాదనకోసం
కొలువుకూటాలకు కులాసాగా, విలాసంగా
నిక్కుతూ అడుగులు వేస్తున్నాయి!
మాయాబజారులో మరో అధ్యాయానికి
కదలివస్తున్నాయి!! (8.2.2000)

# నిర్లిప్తత

విధ్యుక్త ధర్మాన్ని విడచి
బేలగా బిక్కమొగంతో చూస్తే -
కోరికలు తీరవు!
తామరాకుపై నీటిబొట్టులా ఉండటం మంచిదే;
కానీ
నీటిబొట్టు తామరాకుపై ఉన్నంతవరకే
దానిసోయగాలు;
జారి నీటిలో పడినాక
దాని చిరునామా ఎవ్వరి కెరుక?
అందుకే
తామరాకుపై నిలువగలిగేందుకైనా
కొంత ప్రయత్నించాలి!
నిర్లిప్తంగా డొల్లిగింతలు పెట్టినా
నాకేం భయం లేదంటే
ఆకు అడుగున అగాధమడుగు
నిన్ను కలుపుకోవాలని
ఆటాడిస్తోందని మరువకు!
ఎవరెట్లాపోతే నాకేం
అన్నంతవరకు హాని కొంత వరకే -
అలా పోయే 'ఎవరు'లో
నువ్వూ ఉంటావని మరచిపోతే

నీ గురించి అడిగేవారు
నీ లాగే ఎవ్వరూ ఉండరు!!
కనుక
నిర్లిప్తత ఒక అర్థంకాని
అయోమయ తత్త్వం అని తెలుసుకుని
వేలెడంతలేని నీ బుర్రని
నిర్లిప్తబండికి అనుసంధానం చేసి
ఇంధనం ఖర్చు తగ్గిందని
ఇహాపర సంచారం ఫ్రీ అని
మరీ ఇద్దై పోకు -
షోకు బ్రేకై పోగలదు!!

## అభినందనలు

ఏభైయేళ్ల దేశపాలకులు
తాపీగా జోగిన పాపం;
కార్గిల్ శిఖరాల సందులో
పెనుమట్టిగ మొలిచిన శాపం!

తమ పబ్బం గడచిన పెద్దలు
అందించిన రక్త పిశాచి
తమ స్వార్థం తీరిన మీదట
వెలయించిన కొత్త కబేళా-

జాతీయతకోసం చచ్చే
జన జాగృత మూర్తుల కీర్తికి

మత ఛాందసవాదపురంగులు
హత్తించిన మూర్తుల తీరిది -

ఈదేశం ఏమవుతున్నా
సరిహద్దులు చెరిపేస్తున్నా
అసమర్థులు కుర్చీలెక్కి
భోక్తలుగా విజృంభిస్తే-

భవితవ్యం ఏమవుతుంది?
భారతి పరువేమవుతుంది??

సైనికులకుతప్పని మరణం
సామాన్యుల బ్రతుకుల నిధనం
నిలదీసిన వాళ్లకు దండన
కలిసొచ్చిన వాళ్లకు దీవన!

ఏమవుతుందీ దేశం
ఎటు తప్పును జాతి వినాశం??
ముష్కరులను లెక్కించకనే
మౌనంగా జాతిని కాచే
సైనికులకు జేజే లివిగో.... ...
అభినందన మాలిక లివిగో....

(అమరజవానులకు అశ్రుతర్పణంతో)
(7.7.1999)



# హృదయాంజలి

స్వతంత్ర భారతి గుండె కవాటం
పరిరక్షించే వీరజవాన్లకు
అందిస్తున్నా నా హృదయాంజలి
స్నిగ్ధరసామృత పరిపూర్ణాంజలి!!

కరుడుగట్టిన ముష్కరమూకల
నుక్కడగించే స్థిరచిత్తంతో
కర్తవ్యానికి అంకితమౌతూ
మాతృభూమి పరిరక్షణకోసం-

తమ ప్రాణాలను గడ్డిపోచగా
త్యాగం చేస్తూ శత్రుమూకలను
వెదకి వెదకి యమపురికి పంపుతూ
దేశప్రజల ప్రాణాలు నిల్పుతూ

అమరవీరులై పురోగమించే
ధీరోదాత్తులు - చైతన్యాత్ములు!!

నిస్వార్థంతో - నిజాయితీతో
నిష్కల్మషులయి - నిర్భీతులయి
చెలరేగే మన వీర జవాన్లకు
అందిస్తున్నా నా హృదయాంజలి--

కడదాకా తన కన్ననేలనే
సేవించే బహుధన్యజీవులు;
తల్లినేలకై తనువులు విడచే

దేశభక్తులు - పుణ్యమూర్తులు!!

వీరజవానులు ధీరమూర్తులు
మనలను గాచే వారి కోసమై
అందిస్తున్నా నాహృదయాంజలి
స్నిగ్ధ రసామృత పరిపూర్ణాంజలి!!! (18.7.1999)

# దేశభక్తి

పరాయిపాలనలో
రెండు దశాబ్దాలుగా కుళ్లికుతాబులయ్యాక-
సహనం ఆసాంతం చచ్చాక,
గత్యంతరం లేని పరిస్థితుల్లో
వెన్నలా
అప్పుడెప్పుడో ఉద్భవించింది
దేశభక్తి!
ఇండియాలో
చరిత్రకాలం నుంచీ
అరుదుగా లభ్యమయ్యే
ఆయుర్వేద వనమూలిక ఇది!
అక్కడో మొక్క -అక్కడో మొక్కగా కనిపించి
అకస్మాత్తుగా
ఏమృగరాజు ఆకలిదప్పికలకో
ఆహుతి అయిపోతుంటుంది-
అంభికాలం నుంచి

అయూబ్‌ఖాన్‌ని యుద్ధానికి రమ్మని
అదే టెక్నిక్‌లో ఆహ్వానించిన కాలం వరకు-
భారతదేశం బల్లపురుగానే ఉంది!
ఎక్కడో ఒకటీ, అరా
దేశభక్తి వృక్షాలు మొలిచినా
అవి విత్తనాలు చల్లకుండా
సమూలంగా
భూకంపానికి తలలువంచి కూలిపోయాయి!!
కనుమరుగైపోయిన
వేదశాఖల్లాగ
దేశభక్తుల ఆనవాళ్లుకూడ
మళ్లీ కన్పించక పోవచ్చు-
రాజకీయ రంథిలో పడిన బడా నాయకులకే
స్వదేశీ- విదేశీ భేదం నశించిపోయి
అంటు-మైల అంటని నిర్వికారస్థితి
వచ్చేసింది!
తనపనికి అడ్డురాకుండా
తన లాభానికి సాయపడితే
ఏదేశీయుడైనా సరే అభ్యంతరం లేదు!
కాశ్మీర్ పూర్తిగా అన్యాక్రాంతమైనా
వారికేం పర్వాలేదు-
ఏభైయేళ్లేకాదు!
ఇంకో వందేళ్లు పాలించినా
ఇరవై ఎనిమిది రాష్ట్రాలు

సింగపూర్‌లోనో, కీన్యాతోనో
సహారాలోనో కలిసిపోయినా
వారి సింహాసనం భద్రంగా ఉంటే-
వీర జవానులు ఎందరేల్లినా
శతవర్షాధిక చరిత్ర కల్గిన
రాజవంశ్యులకు ఢోకా ఉండదు!
పేరుకు ప్రజాస్వామ్యమే అయినా
దేశాన్ని టోకున కొనేసిన
రాజవంశానికి
పోస్ట్ డేటెడ్ చెక్‌మాదిరిగా
నిరక్షరమూకలు ఏభైయేళ్లక్రితమే
శాశ్వత పవరుపట్టా రాసిచ్చేశారు!
మనది
దొరలతరహా ప్రజాస్వామ్యం కాదు
దొంగల తరహా
ఏకవంశ రాజస్వామ్యం!
వీలునామా రాయించుకునేందుకు
తడవ తడవకీ వేలకోట్ల ఖర్చెందుకు?
ఎమర్జెన్సీ క్వీన్‌లాగ
ఇండియా నాకు ఎప్పుడో దొరికిందంటే పోలా?
ఎన్నికలొక పబ్లిక్ స్టంటు
లాలూజీ ఎరిగిన కిటుకు!!

(15.8.99)



# భారత్ మాతాకీ జై

సరిహద్దుల రక్షణకోసం
అసువులనే త్యాగం చేసి
అమరులుగా వెలుగొందారు
కార్గిల్‌లో వీర జవానులు!

చలిపులికే మాత్రం జంకక
తమ  రక్తం గడ్డకట్టినా
తిన తిండీ దొరకకపోయిన
కునుకన్నది లేనే లేక
శత్రువులను గురి చూశారు
సరిహద్దులు కాపాడారు.,
తను పుట్టిన నేల తల్లిని
సేవిస్తూ కనుమూశారు!!

మీ సేవలు అజరామరము
మీ త్యాగం నిరుపమానము
మీ స్ఫూర్తియె సంస్మరణీయం
 మీ దీక్షయె ఆచరణీయం-

మీ కథలను విన్నాకయినా
మనుషులలో మార్పువచ్చునా?
మీ నడకను చూచాకయినా
నేతలకొక నీతి కల్గునా?

నఖశిఖ పర్యంతముగా
స్వార్థమనే రోగం నేడు
ప్రతివాణ్నీ కదలిస్తోంది
తనవైపే నడిపిస్తోంది!!

అయినా ఈ దేశ రక్షణే
తమప్రాణం కన్నా ఎక్కువ
అని చాటిన అమరజవానుల
పంథాయే మనకాదర్శం!

అని ఎందరు ఆచరింతురు?
తననేలను గౌరవింతురు?
తనకోసం కన్నతల్లినే
అమ్మేసే ఘనులే అందరు!
పిసరైనా పొరుగువాడికి
సహకారం ఇవ్వని వాడికి
జాతీయత గుర్తు వచ్చునా?
త్యాగం అణువైన అబ్బునా?
ఈ దేశం నాదేనన్న
అభిమానం పుట్టుకొచ్చునా?
''నాదేశం కోసం నేను
నిలబడతాన''ను దీక్షకల్గునా?

మన జాతికి ద్రోహం చేస్తూ
పరజాతిని నెత్తిన మోస్తూ
తమలాభం కోసం నడిచే
నాయకులకు తెల్వికల్గునా?

మహనీయులు చేసిన త్యాగం
మనకెందుకు లెమ్మని మరచి
ఈనాడు విదేశీ వనితకు
వంగి సలాం కొడుతున్నారు!!
పరజాతీయులపట్ల
చూపించే అభిమానంలో
నిండా తమ స్వార్థమున్నది
తమలాభమె దాగి ఉన్నది-

ప్రజలేమీ తెలియని వాళ్లని
ఎటు తోలితె అటు వెళ్తారని
ఈనాయకులకు గట్టి నమ్మకం
తామే మొనగాళ్లని గర్వం!!

ఈ మూర్ఖత వదిలించాలి
ప్రతివారికి కన్ననేలపై
మమకారం కలిగించాలి
సైనికులుగ నడిపించాలి!!

ఆనాడే భరతమాతకు
నిజమైన స్వతంత్రదినం!
ఆనాడే జాతి భవితకు
స్వర్ణోత్సవ పర్వదినం!!

భారత్ మాతాకీ జై
అమరజవాన్‌కీ జై (15.8.1999)

# ధర్మం చెరచకు!

కురుక్షేత్ర రణరంగానికి
కొత్త సమీకరణాలు జరుగుతున్నాయి!
ఈ సారి పార్థసారథి లేకుండానే
జగన్నాటకం రక్తి కట్టబోతోంది-
హిందూదేశంలో
మతం పేరెత్తరాదని
'లౌకిక తత్త్వం' అనే జగన్మోహినిని
ప్రతిపాదించింది రాజ్యాంగం!
అది ఆసరాగా చేసుకుని
ఇండియాలో హూణులు జరిపే
మత మార్పిడులకు పోప్ కితాబులు!!
ఆంగ్లం మనపైన రుద్దితే
మన సంస్కృతి సర్వనాశనం
కాగలదని ఊహించాడు
టామస్ బాబింగ్టన్ మెకాలే-
నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి
స్వావలంబనకు,
పారిశ్రామిక ప్రగతికి
హిందూ ధర్మంలో వృత్తి విద్యలతో ఏర్పడిన
కుల కట్టుబాట్లని
హూణ సంపర్కంతో చెలరేగిన
పండిత ముష్కరులు

సమూలంగా నాశనం చేయాలని
కంకణం కట్టుకున్నారు!
వేలాది వేదశాఖల్ని
నామరూపాలు లేకుండా తుడిచిపెట్టి
పోప్ ప్రశంసలు పొందుతున్నారు-
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి అన్న పెద్దమనిషి
అడ్రస్ లేకుండా పోయాడు!
ఆధ్యాత్మిక విద్యారహస్యాల్ని
అణువణువునా ఛేదించి
పరమాత్మస్వరూపాన్ని
సాక్షాత్కరింపజేసి
జన్మసాఫల్యాన్ని అందించే
భారతీయ ధర్మం
ముష్కరమూకల వితండవాదాలలోపడి
కాసింతైనా నీడలేక
నీరసపడిపోతోంది!
వేలయేండ్లుగా యావత్ప్రపంచానికి
విజ్ఞాన భిక్ష నందించిన
వైదిక విద్య
పోషించే నాథుడులేక
ఆశించే అభ్యర్థులు లేక
అంతర్హిత మౌతోంది!
దాని నందుకోలేని

మూర్ఖజాతి విలపించాలిగాని
ఆర్షవిద్యకేం నష్టంలేదు-
ఐహిక లాలసలోపడి
ఆముష్మికమార్గం మరచి
వేదభూమి విలువలు విడచి
పనికిరాని పనులను తలచి
పతనమయే భారతీయుడా!
ఇకనైనా కళ్లు తెరవరా-
నీ విద్యలు ప్రోగుచేయరా;
నీ జాతికి విలువ తెలియరా-
నీ మతమొక మతము కాదురా!
సంకుచితపు నీతికాదురా!!
పదిమందికి పరమాత్మునితో
సన్నిహితం కలిగించేదిరా-
ఈతత్త్వం తెలియని మూర్ఖులు
నిందిస్తారది సరికాదురా!
హైందవమొక ధర్మమార్గము
సహనంతో నిండిన దుర్గము
ఓర్పుకు ఒక హద్దుంటుంది-
శ్రుతి మించితే మసి చేస్తుంది!! (జూన్ 1999)



# మహాత్ములు కండి!

ఈరోజుల్లో
మహాత్ముడు కావటమంటే
మాటలతో అయ్యేపనికాదు!
సాక్ష్యం లేకుండా
మర్డరైనా చెయ్యాలి
సారాకాంట్రాక్ట్ చేసి
కోట్లైనా గడించాలి!
మల్టీమిలియనీరో
బ్లడీ మర్డరరో మాత్రమే
మహాత్ములు కాగలరు-
ప్రజాసేవ చేయటమంటే
బాలగంగాధరతిలక్‌లా కాదు!
భగత్‌సింగ్‌లా కాదు;
ఏ విదేశీవనిత బొమ్మనో
ఊరేగించి
దండిగా ఓట్లు దండుకుని
విడవకుండా
అధికార కుర్చీకి అతుక్కుపోతే
బోలెడు ప్రజాసేవ చేసినట్లు!!
అటువంటి వాళ్లకి
పద్మభూషణలు, భారతరత్నలు
బొచ్చెడు బిరుదులు - భోషాణం రూపాయలు!

ఒకవేళ ఏ శనిగ్రహామైనా తన్ని
ప్రజాప్రాతినిధ్యం లభించక పోయినా ఫర్వాలేదు!!
పైవాడి అనుగ్రహం ఉంటే
పైరవీ చేయగల సత్తా ఉంటే-
ప్రజల సొమ్ము తినటానికి
ఏదోగుమ్మం ద్వారా
లైసెన్స్‌బిళ్లకట్టి లోనికి పోనిస్తారు!
ఇక నీ ఆకలికొద్దీ తినొచ్చు-
మహాత్ముడివి కావొచ్చు;
ఇక్కడ ఏదీ ఎవరికీ తప్పుగా అనిపించదు-
వందలకోట్ల జనాన్ని
నీతిమార్గంలో పెట్టగల ఏజెంట్
ఎప్పుడో చచ్చిపోయాడు-
కనుక
నిర్భయంగా నువ్వుమహాత్ముడివి కావొచ్చు!

**(జూన్ 1999)**

# మతతత్త్వవాదం

భగవద్గీతను ఉటంకించినా
రామాయణసారం పలికినా
పక్కామతతత్త్వంగానే
పలువురు పేర్కొంటారు -
మనదేశం లౌకిక రాజ్యం

కులభేదం లేదంటారు
మతఘోషలు వద్దంటారు
అంతా సమమేనంటారు;

అయినా ఒక చిన్నరహస్యం
కొందరు అధిక సమానం
కొన్నిమతాలే ప్రాణం
వారిని ఏమన్నా ఊర్కోం!

మైనారిటీ రక్షణ కోసం
మతస్వేచ్ఛను కల్పిస్తున్నాం-
ఈకొంచెపు మేలిముసుగులో
మతమార్పిడులను గమనిస్తున్నాం...

నానాటికి హిందూ సంస్కృతి
నీరసపడి నశియిస్తోంది-
పాశ్చాత్యుల ధనబలమతమే
తీవ్రంగా వ్యాపిస్తోంది!
ఇన్నేళ్ల హైందవభూమి
క్రైస్తవముగ మార్పు చెందుతూ
కనిపెట్టే నాధుడులేక
చైతన్యం కోల్పోతోంది-

ఆ మతమని నిరసనకాదు
ప్రజ్ఞాన్విత భగవత్తత్త్వం
బోధించిన హిందూ జ్ఞానం
నశియిస్తే తప్పదు నాశం!!

వేదాన్తప్రసారం తెలిసి
విజ్ఞతతో ప్రవచించగల
పండితులే కరవైపోగా
అన్యమతం వచ్చేస్తోంది-
నీతి నియమాలు విధించి
ఆధ్యాత్మిక సంపద పెంచి
న్యాయం ధర్మాలు వచించి
ఏ మానవమాత్రునికాక
నిజమైన దేవుని గూర్చి
బోధించిన హిందూతత్త్వం
సంఘానికి నేడు అవసరం
లేకుంటే తప్పదు పతనం!!

(జూన్, 1999)

## సనాతనం

సనాతన హిందూ ధర్మం
చాదస్తాల కలగూరగంపకాదు;
సత్యాన్వేషణ చేసి
సంఘానికి ఋజు ప్రవర్తనను
నైతిక విలువలను
ప్రసాదించిన మహనీయ తత్త్వం!
మనిషి మనుగడకు అవసరమైన
సకలసౌకర్యాలను అమర్చిన
సాంస్కృతిక వైభవమిది -

సంకుచితత్త్వాన్ని దరిచేరనీయని
సువిశాల దార్శనిక సహన సంపన్నం!!

అబద్దాలు- అన్యాయాలు
కుట్రలు - కుహాకాలు
కుహనా మానవీయత
సంకుచిత – సంక్షోభ్యత
ఇవెన్నీ -
పాశ్చాత్యుల రాకతోనే
ఈ కర్మభూమికి దాపురించాయి!
సనాతన ధర్మాన్ని కలుషితం చేశాయి;
స్వచ్ఛమైన అలనాటి హిందూతత్త్వాన్ని
విజ్ఞతతో ప్రబోధించే విప్లవమూర్తి కరువై
ఈనాడు
'మతం మత్తుమందు' అనే స్థితికి చేరింది!
ఒక వివేకానందుడు – ఒక రామకృష్ణుడు
ప్రభవించి ప్రబోధించినవేళ
ఈదుష్టశక్తులన్నీ
నవరంధ్ర విచ్ఛిత్తితో నిశ్శేష్టమయ్యాయి;
నిర్వీర్యమైన హైందవ జాతి
నిర్లజ్జగా నేడు
పాశ్చాత్యమత వాదానికి
ప్రణమిల్లి, పాదాలు కడుగుతోంది;
జాతికి పట్టిన నిర్లిప్తపిశాచి
పరాధీనత వైపు పరుగులు తీయిస్తోంది;

పంచాక్షరి కొందరి ముందర
పంచాక్షరిగా పరిగణింపబడుతోంది -
సంస్కృతాన్ని తుడిచేశారు
హైందవాన్ని అణచేశారు
ఆంగ్లభాష రుద్దించారు
క్రైస్తవాన్ని ప్రాకించారు

ధర్మబుద్ధి తొలగించారు
కపటబుద్ధి నేర్పించారు
బానిసలను గావించారు
బ్రతుకు తీరు మార్పించారు

ఈ స్వాతంత్ర్యం ఒక డొల్ల
ప్రజాస్వామ్యమొక కల్ల
జాత్యభిమానం కన్న
బానిస బుద్ధేమిన్న-
ఇంకే మగునీ దేశం?
ఏమిచ్చును శుభ సందేశం??
సంస్కారపు చేవ నశిస్తే
నిస్తేజం మనను వరిస్తే
మనజాతికి పరువేముంది?
విజ్ఞానపు బరువేముంది?

కలగాలి జాత్యభిమానం-
మారాలి బ్రతుకులవైనం;
రావాలి నూతనతేజం
తెలియాలి మనుషుల నైజం!! (ఆగస్టు 1999)

# పవిత్ర భారతి

అగ్నిచుట్టూ ధూమం లాగ
నాపవిత్ర భరత భూమి చుట్టూ
ఎన్నో కశ్మలాలు కమ్ముకుంటున్నాయి-
అయినా ఎప్పటికప్పుడు గంగాజలంతో
నా జన్మభూమి పునీత అవుతూనే ఉంది!
అండర్‌గ్రౌండ్ డ్రెయినేజీ
అన్నిరంగాలనీ కలుషితం చేస్తున్నా
ఆ సేతు శీతాచలపర్యంతం ప్రభవించిన
ధార్మికౌషధులు
సకల వ్యాధుల్నీ నివారించి
సంస్కృతిని కాపాడుతున్నాయి!
వేలయేండ్ల చరిత్రకల్గిన యీ ధర్మక్షేత్రం
ఎన్నోకురుక్షేత్రాల్ని చూసింది;
ఎందరెందరో అంభినామధేయుల్ని
జయచంద్రులని, నైజాముల్ని
ప్రజల ధనమానప్రాణాల్ని విందారగించిన
మనుష్యాకారుల్ని చూసింది!
అయినా-
ఇక్కడ భూ కంపాలు రాలా;
ఇటువంటి గంజాయి మొక్కల్ని గుంజేయటానికి
ఎటువంటి ప్రళయాలూ సంభవించలా!
దేవదేవుడు ఇప్పటికీ మరో అవతారం ఎత్తలా!

గంగ ప్రవహిస్తున్నంతకాలం
భారతీయులకి
కశ్మలభయంలేదు
సాక్షాత్తూ ఆనాటి దుర్యోధనుడు, రావణాసురుడు
ఇద్దరూ ఒకే అంశతో పుట్టుకువచ్చినా-
ఐరోపా జాతీయులందరూ
ఏకాంశరూపులై మళ్లీ పాలకులుగా వచ్చినా-
మన భారతం చెడదు!
చెడే స్వభావం కలిగి ఉంటే
ఎప్పుడో దానికి చేటుమూడి ఉండేది!
బంగారానికి చిలుము పట్టనట్లు
పవిత్ర భారతికి నాశనం ఉండదు!
ధర్మానురక్తి కలిగిన
కర్మానుసారి ఒక్కడున్నంత వరకు
మన కర్మభూమిని కబళించే
ఘోరకలి ఆటలు సాగవు;
ఎప్పటి కప్పుడు మహాదేవుడుదయిస్తుంటాడు-
భారతి పవిత్రతని కొనసాగింపజేస్తాడు!!

(సెప్టెంబరు 1999)



+28